ంచ తెలుగు మహాసభ ప్రచురణ

# ఆశుకవితలు
# వధానములు - చాటువులు

రచయిత

డాక్టరు కేతవరపు రామకోటి శాస్త్రి




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
సైఫాబాదు
హైదరాబాదు - 500 004

1975

# ము౦దుమాట

ఎన్నో ఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వ సమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరినీ ఒక చోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలంనుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదు కోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడే వారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వ యుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్ళడం జరిగింది. అట్లా వెళ్లిన తెలుగువారు తమ భాషా సంస్కృతీ సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళ వించి, వాటిని సుసంపన్నం చేస్తూ ఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంత ర్జాతీయ, సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికీ, తద్వారా వివిధ చైతన్య స్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహద కారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు అర్థవ మైన భావసమైక్యతకు ప్రాతిపదికలై తెలుగు జాతిని సమైక్యం చేయగలవనీ, ఆవిధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారం రోజులపాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసిన ప్రము ఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభల

సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల, కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటంచేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగు వారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియంను) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజ భూతమవుతుంది. తెలుగు వారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతీ సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రంచేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

**జలగం వెంగళరావు**

అధ్యక్షులు,

ప్రపంచ తెలుగు మహాసభలు.

# ప రి చ య ము

సహస్రాబ్దాలుగా ప్రవర్థమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగు దేశపు నలుచెరగుల పరిచితముచేయు సంకల్పముతో 1975వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది. అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో వసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగునటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వాన సంఘము ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖమంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్యనిర్వాహకాధ్యక్షులు, ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగా ఆంధ్రభాషా సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వహణకై 44 మంది సభ్యులుగల ఒక విద్వత్ సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది. ఆ విద్వత్ సంఘము ఆ లఘుగ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆ యా రంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగా యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప వలసినదిగా ప్రపంచ తెలుగు మహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభ సఫలతకొరకై కృషిచేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ **"ఆశుకవితలు-అవధానములు-చాటువులు"** అను గ్రంథమును రచించిన **డాక్టరు కేతవరపు రామకోటి శాస్త్రిగారు** ఆంధ్ర పాఠక లోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతా బద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన 'రమేష్ ప్రింటర్స్', చిక్కడపల్లి, హైదరాబాదు వారికి మా కృతజ్ఞత.

**దేవులపల్లి రామానుజరావు**
కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.

హైదరాబాదు,
తేది : 19-3-75.

# వి ష య సూ చి క

# ఆశుకవితలు - అవధానములు - చాటువులు

## 1. చతుర్విధ కవితలు

### 1. స్వరూప నిరూపణము

తెనుగు కవిత్వము నాలుగు విధములుగా నున్నదన్న ఒక చూపు పదు నారవ శతాబ్దమునకు ముందే తెలుగు మహాకవుల కున్నది. అట్లు నాలుగు విధ ములుగను వ్రాయగలుగుటయే పరిపూర్ణతా లక్షణమన్న నిశ్చయమును కుదురు కొన్నది. అల్లసాని పెద్దన్నగారు తాదృశమైన పూర్ణ కవితాశక్తి తనయందున్న దన్న ఆత్మవిశ్వాసముతో గద్యవ్రాసి కొనెను.[1]

చతుర్విధ కవిత యనగా ప్రాచీనాంధ్ర లక్షణ కర్తలు ఆశు - మధుర- చిత్ర - విస్తర కవితా మయమని అర్థము చెప్పిరి.[2] మనుచరిత్రమునకు టీక వ్రాసిన శ్రీ జూలూరి అప్పయ్య పండితుడు "ఆశు-బంధ—గర్భ-చిత్ర" కవితా మయమైనదియే చతుర్విధ కవితయని వ్రాసిపోయెను. కాని కవులందరును ఆశు- మధుర-చిత్ర-విస్తరములనే పేర్కొనుచు వచ్చుచున్నారు.[3]

చతుర్విధ కవితా నిర్వాహకుడనని రామరాజ భూషణుడు వ్రాసినాడు.[4] నంద్యాల కృష్ణవిభుని యాస్థానమునందు "ఆశు-మధుర-చిత్ర-విస్తార కవితా విజృంభణ స్తంభిత బాణ భవభూతి భాస కాళిదాస ముఖ్య విఖ్యాతి గౌరవులగు

---

1. "శఠకోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధ కవితామతల్లికాల్లసానిచొక్కయా మాత్య పుత్ర పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిష మనుసంభవంబను మహా ప్రబంధంబునందు..."
2. మీగడ తఱకలు - పుట 93.
3. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - సాహిత్య సమీక్ష - పుట 2.
4. వసుచరిత్రము. 1-167

కవులు" కలరని పింగళి సూరన్న చెప్పెను.[5] బృహస్పతి వద్ద విద్యలనభ్యసించిన చంద్రుడు "చిత్ర విస్తర మధురాశులీలఁ గవితల్ రచియింపఁగ నేర్చె"నని శేషము వేంకటపతి చెప్పినాడు.[6] మరియు గణపవరపు వేంకటకవి "అమితాశువు - మధురము - చిత్రము - విస్తరము నా చతుర్విధ కవితల" కవిత రచింపఁ గలనని ప్రతిజ్ఞ చేసినాడు.[7] శహాజీ మహారాజు "చతుర్విధ మహా సాహిత్య నిర్వాహకుం"డని ఆయన కృతులయందు స్పష్టముగా నున్నది.[8]

గద్యలో వ్రాసికొనకపోయినను తన కృతిపతియైన సింగనామాత్యుని కొలువున మృదు మధుర చిత్ర విస్తర కవితా విలాస వాగీశ్వరులగు కవీశ్వరులున్నారని శ్రీనాథుడు చెప్పెను.[9] ఇందు గమనించవలసినది చతుర్విధ కవితలలో ఆశు కవిత యొక్క అభావము. మరియు దాని స్థానమున మృదు కవిత్వమనునొక క్రొత్త కవిత్వము వచ్చి కూర్చుండుట. మృదు కవిత్వమునకు ప్రత్యేకముగా లక్షణము లేదు. అందువలన నదియు మధుర కవితలో అంతర్భవించునని చెప్పబడుచున్నది. మధుర కవిత్వమును నిర్వచించుచు లాక్షణికుడే 'మృదు మధుర వచన రచనల ప్రసిద్ధంబైన యవి మధుర కవిత్వంబులు' అని ముగించెను. అందువలన మృదు కవిత్వమని ప్రత్యేకముగా లేదు.[10] లేనిదాని నున్నట్లనుకొని అది ఆశువునకు మరొక పేరనియు నన్నయాదులట్లే వాడియున్నారనియు సర్దుకోనక్కరలేదు. మరొక విషయము నన్నయగారు భారతావతారికలో రాజరాజు విద్వద్గోష్ఠి యందు మృదు మధుర చిత్ర విస్తర నవరస భావ భాసుర కవితా రచనా విశారదులయిన మహాకవులున్నట్లు వ్రాసిపెట్టి పోయినట్లు ప్రచారము ప్రసిద్ధముగా నున్నది.[11] కాని భారతమునందు సంశోధిత

---

5. కళాపూర్ణోదయము. 1-11
6. శశాంక విజయము. 2-54

7-8 దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము. సాహిత్య సమీక్ష పుట-2

9. శృంగార నైషధము. 1-11
10. "సొగసు గల మృదు కవిత నీ మొగను చూచినంతనే కల్గు". నానారాజ సందర్శనము. పూర్వార్ధము 70.
11. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము. రెండవ సంపుటము. 570.
విజ్ఞాన సర్వస్వము. ఆరవ సంపుటము. 617.
ఉదాహరణ వాఙ్మయ చరిత్ర. 13.

ప్రతియందు కూడ 'మృదు మధుర రస భావ భాసుర నవార్థ వచన రచనా విశార దులయిన మహాకవులును' అనియే యున్నది[12]. మృదుమధురముల ప్రక్కన చిత్ర విస్తారాదికము లనివార్యముగా నుండనక్కరలేదు. అందువలన అధో జ్ఞాపికా పాఠమును ప్రమాణము చేసి చేయనక్కరలేదు.

ఈ విధముగా ఏవి చతుర్విధ కవితలన్న విషయమున నిశ్చితాభిప్రాయ ములు మొదటి నుండియు లేనట్లే కనుపించుచున్నది. అయినను ఆ లెక్క వచ్చినపుడు వార్తాకవి రాఘవయ్యగారి మాటయే సాగుచున్నది.[13]

## 2. మధుర కవిత

"మధుర కవిత్వంబన్నది నాటకాలంకారంబులు – కళికోత్కళికలు – విభ క్త్యధిదేవతోదాహరణములు – సప్తతాళ నటనలు – నట్టొట్లు – గీతప్రబంధములు– చతుర్భద్రికాష్ట భద్రికలు – బిరుదావళి – నామావళి – భోగావళి – రంగఘోష – త్యాగఘోష – చతురుత్తర సంఘటనలు – యక్షగానంబున వెలయు పదంబులు – దరువులు – ఏలలు – దవళంబులు – మంగళహారతులు – శోభనంబులు – ఉయ్యాల జోలలు – జక్కుల రేకుపదంబులు – చందమామ సుద్దులు – అష్టకంబులు – ఏక పద – ద్విపద – త్రిపద – అష్టపదులు – ఇవియాదిగా గల్గునన్నియు" నని మధుర కవితా విశేషములు చెప్పబడినవి. ఈ లక్షణము స్త్రీల పాటలను జానపద గేయ ములను స్తోత్రములను ఛందో విశేషములను కావ్య ప్రక్రియా విశేషములను కలగా పులగముచేసి చెప్పుచున్నది. నాటకమది యొక ప్రక్రియా విశేషము కదా! అలంకారము శాస్త్రగ్రంథము కావలయును. కళికోత్కళికలు ఉదాహరణ కావ్య విశేషములోని ఛందో విశేషములు. ఆ కావ్యమును అందలి ఛందస్సులను విడివిడిగా చెప్పనక్కరలేదు. అట్లే యక్షగానము విషయముకూడ.

"మధుర కవితలు ప్రాయికముగా భాష – భావము – ఛందను – దేసిగా నుండుటచే సంగీత సంస్కారము గలిగిన సామాన్య జనుల నాలుకల మీద నాట్యమాడునవిగా నుండును గాన తొలుతనవి యంతగా లిపి కెక్కకపోయెను.

12. ఆదిపర్వము. 1 – 8.

13. లక్షణ దీపిక. అముద్రితము. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర. 14–16.

సంస్కృత ప్రాయరచనలుగల చిత్ర విస్తర కవితల ప్రాబల్యమునకూడ వానికి సత్కవితలలో పరిగణన మంతగా లేకపోయెను. (ఇటీవల) కవులుగా పురాణ ప్రబంధ రచయితలే పరిగణింపబడుచుండిరిగాన మధుర కవితా రచయితలు లెక్కకెక్కకున్నారు.[14]

## 3. చిత్రకవిత

చిత్రకవిత్వంబన్నది పాదగోపనంబును పద్య భ్రమకంబును, నామ గోపనంబును, అనులోమ, విలోమ గతి పద్యంబులు, కందగీత గర్భిత వృత్తంబులు, కందద్వయ గర్భిత మణిగణనికరంబును, క్రౌంచపద గర్భిత కందద్వయంబును, ద్విపద చౌపదలు, సువ్వాల మంగళహారతి దవళంబులు, శోభనా చంద్రికాది పద దవ్వాలాది లయగర్భిత సీసంబును కంకపటహ మండూక తురంగ నట భేరీ నినాద నాలుకరంప వృత్తంబులును, ఓష్ఠ్య నిరోష్ఠ్య సంకరజిహ్వా అచలజిహ్వా వృత్తంబులును, రగడ భేదంబులును, తాళగతులును, దండక వృత్తంబులును, అష్టదళ షోడశదళ ద్వాత్రింశద్దళ పద్మబంధంబులును, నానావరణ ద్వాదశావరణ చక్రబంధంబులును, రథనాగ, ద్వినాగ, కులాలచక్ర, ఆందోళికాచ్ఛత్ర బంధంబులును గోమూత్రికా పుష్పమాలికా పుష్పగుచ్ఛ మృదంగ డమరు ~~ఖడ్గ త్రిశూల కంకణ~~ సర్వతో భద్ర కవికల్పిత కల్పవల్లరి నివియాదిగాగల్గు బహువిధ చమత్కారంబుల చిత్రంబులు రచియించుటం జేసిన చిత్రకవిత్వము".[15]

మధుర కవితలుగా ముందు చెప్పబడిన మంగళహారతులు దవళములు ద్విపదలు మొదలయినవి విచిత్ర కవితలుగా కూడ చెప్పబడినవి. ఇది పద్ధతిగా లేదు. కంక పటహ మండూక తరంగనట భేరీ నినాద నాలుకరంప వృత్తంబులు మొదలయినవాని సంగతి సరిగా తెలియుటలేదు.

చిత్రమనగా ఆశ్చర్యముగనుక పరమాశ్చర్యకరములుగా ఈ పద్యములు రచింపబడుటచేత చిత్రకవితలైనవి కావచ్చును. కాక బంధకవిత్వ మంతయును బొమ్మలువేసి వ్రాయవలసినదే గనుకను చిత్రకవిత్వమన్న పేరు వచ్చి యుండవచ్చును.

---

14. మీఁగడ తఱకలు. 93.

15. లక్షణ దీపిక.

ఈ చిత్రకవిత్వమును మిక్కిలిగా సాధన చేసి చేసి చిత్రకవి ఇంటి పేరుగా ప్రసిద్ధులైన కవులు కలరు. బిల్హణీయమును నిజముగా వ్రాసిన సింగరార్యుడు "చిత్రకవి వంశ దుగ్ధాబ్ధి శీతభానుడు".[16] మరొకడు లాక్షణికుడు చిత్రకవి పెద్దన.

## 4. విస్తరకవిత

"విస్తర కవిత్వంబన్నది ఇష్టదేవతా ప్రార్థనయు, కృతికర్త వంశావళియు, – పుర, గిరి, మృగయా, యాత్ర, వన, జలనిధివర్ణన, ద్యూత వినోద, రాయబార, వివాహోత్సవ, సురతక్రీడ, పుత్రోత్సవ, సూర్యోదయ, సూర్యాస్తమయ, చంద్రోదయ, చంద్రోపాలంభన, విరహ వర్ణనలు – షడృతువుల వర్ణనలు, జలక్రీడలు, మధుపాన, దండయాత్ర, రణక్రీడ, దిగ్విజయము ఇవి యాదిగాగలుగు అష్టాదశ వర్ణనలు, అలంకారములు, రీతులు, శయ్యలు, వృత్తులు, పాకంబులు, ఉత్ప్రేక్షలు, శ్లేషోల్లేఖలు-ధ్వనులు, వ్యంగ్యములు నివియాదిగా గలుగు కావ్యలక్షణంబులు గలిగి పంచలక్షణ దశలక్షణంబుల నొప్పి కథాసరణి వర్తిల్లుటం జేసి యది విస్తరకవిత్వంబన్నది మహాప్రబంధంబు–"[17]

విస్తరకవితయే ప్రబంధమని లాక్షణికుడు చెప్పుచున్నాడు. ప్రథమాంధ్ర ప్రబంధకవి నన్నెచోడుడు తన కావ్యమును వస్తుకవిత యని పేర్కొనినాడు. విస్తర వస్తుకవిత్వములు రెండును కేవలమొకటి కాకపోయినను వస్తుకవిత విస్తర కవితలో అంతర్భాగముగా చెప్పబడుచున్నది. పురాణేతిహాస రూపమున నున్న దంతయును విస్తరకవితలు. అవియెట్లును బహువస్తు విస్తరములు. ఏకవస్త్వాత్మకముగా నుండి నిబిడమైన కావ్యరచన కలిగినది వస్తుకవిత. అందువలన నిదియొక పద్ధతిగా విస్తరకవితయందంతర్భూతమగు చున్నది.[18]

చతుర్విధ కవితలలో ప్రధాన విభాగముగానున్న ఈ విస్తరకవితను గురించి లాక్షణికు లింకను వివరించి యుండవలసినది. కాని వారీ పారిభాషిక

16. బిల్హణీయము. 1-6
17. లక్షణ దీపిక.
18. కవిరాజ శిఖామణి. 56.

మును పట్టించుకొనలేదు. ఇతర ద్రావిడ భాషలయందును విస్తరకవితయని వినుపించుటలేదు. నన్నెచోడుని వస్తుకవితయే కన్నడము నందును వినుపించు చున్నది.[19] "వస్తు రసాలంకార ప్రాధాన్యవృత్తి కబ్బంబులు పెంపొందు"[20]నని యా మాత్రము చెప్పుటలోకూడ విన్నకోట పెద్దన వస్తువనియే చెప్పినాడు. విస్తర మనుమాటనే విస్మరించినాడు. అనగా విస్తరకవిత యందు వస్తుకవిత అంతర్భ వించుట కాక వస్తుకవితయందే విస్తరకవిత అంతర్భూతము చేయబడినదని చెప్పవలయును.

## 5. ఆశుకవిత

కవిత్వము యొక్క ఆవిర్భావమే ఆశువుగా నున్నది. ఆదికవి వాల్మీకి విషయమున అదియట్లే కదా! శోకార్తుడైన వానిచేత వ్యాహృతమైన వాక్యమే కదా శ్లోకమైనది? ఆ శ్లోకమేకదా కవిత్వమనబడిన మొదటి పదసముదాయము! మరియునది పాదబద్ధమును అక్షర సమమును తంత్రీలయ సమన్వితమును అయి యున్నది. ఆర్తుడైన వానినుండి కవిత్వ మట్లు ఆశువుగా నవతరించును. ఆర్తియనగా జీవుని వేదన; పొందెడు ఉత్కంపనము. సమాహిత చిత్తమందు త్కంపన వృత్తిని ప్రవర్తింప గలిగినవాని వాగ్వ్యాపారము ఛందో బద్ధమై కవిత్వముగా నవతరించు చున్నదనుటకు నిదర్శనముగా వాల్మీకి మహర్షి యున్నాడు. అందువలన కవిత్వముయొక్క ప్రథమ లక్షణము అది ఆశువు గానుండుటయే. ఋషులయందది యట్లున్నను మానవుల యందు ప్రయత్నసాధ్య ముగాతోచి కవిత్వము తన ఆశులక్షణమును తగ్గించుకొన్నది. తగ్గించుకొన్న తరువాత అది మధురకవిత యని, చిత్రకవిత యని, విస్తరకవిత యని బహు విధములయినది. మహాకవులయిన వారు కవిత్వముయొక్క ప్రథమావతార రూపమును ఆశువును కలుపుకొని కావ్యసరస్వతి యొక్క చతుర్ముఖాకృతి నుపా సించిరి. కాలముగడచినకొలదియు మిగిలిన అన్ని విషయములందును మార్పులు వచ్చినట్లే కవిత్వమునందును మార్పులు వచ్చినవి. ఆశువుగా కవిత్వము ఆవిర్భ వించుటగాక ఆశువుగా ఆవిర్భవింపజేసిన పాదబద్ధమును, అక్షరసమమును-

---

19. కుమార సంభవము (మద్రాసు యూనివర్సిటీ); పీఠిక. xxxi.
20. కావ్యాలంకార చూడామణి. 4-45.

తంత్రీలయ సమన్వితమును అయిన వాగ్వ్యాపారమునకు కవిత్వమని పేరు వచ్చినది. ఇక్కడ కవి సమాహిత చిత్తమునందుత్కంపనమును పొందుట మరుగున బడిన విషయమైనది. వాగ్వ్యాపారమును ఛందోబద్ధముగా ప్రదర్శించుటయే ఆశుకవితాలక్షణముగా నైనది. ఇంతకుమించిన చమత్కార కారియైన ఏ చిత్రశిల్ప విశేషమును జోడించినను అది విశేషమై కూర్చున్నది. ఈ విశేష లక్షణ లక్షితముగా నాశువులను చెప్పినవారే కొందరు పోగా కొందరు మనదాకా మిగిలినారు. ఆశువులుగా చెప్పబడినవి కాలముమీద నిలబడినప్పుడు చాటువులుగా ప్రసిద్ధములగును. ఆశువులయొక్క సద్యఃకాలరూపములు బహుభంగులుగా నున్నవి.

## 6. విద్వత్కవుల విమర్శన దృష్టి

చతుర్విధ విభాగము మీద కవిత్వమును భావించుటను కాదనక పోయినను ఈనాలుగింటి మీదను మనవిద్వత్కవులకు సమమైన దృష్టిలేదు. ప్రౌఢసాహిత్య విద్యాతత్త్వ వేత్తలు చిత్రకవిత్వమును శబ్దాలంకార ప్రాయమునుండి పైకెదిగి రానీయలేదు. చిత్రకవితా ప్రధానములయిన కృతులను అధమ కావ్యములుగానే ఆలంకారికులు జమకట్టిరి. చిత్రకవిత్వమునకు పెద్దప్రయోజనము నెవరును చూచినట్లు లేదు. "చిత్రకవిత్వము చమత్కారాపాదకమగు కావ్యరచనా శిల్పము. ఇది బుద్ధి సంబంధి. సామాన్యులకును అంతగా సరసులకును సంబంధించినది కాదు. పాండితీ శౌండీర్యమును ప్రకటించు పండిత ప్రకాండుల గమ్మత్తయిన గారడీ కసరత్తుల సాముగరిడీలు ఈ చిత్రకవితారీతులు."[21]

ఆశుకవిత్వము కూడ కవితా తత్త్వముకలిగినది కాదు గనుక సమాదరణీయము కాదనియే ప్రాచీనుల యభిప్రాయము. కవిత్వమును విజ్ఞానద్వారముగా భావించినవారు-ఇందువలన ఎటుక సమగ్రము కావలయునని ప్రయోజనము నాశించినవారు ఆశువు నంగీకరింపలేదు. అప్పకవి వ్రాసి పెట్టినాడు:

---

21. ఆంధ్ర సంస్థానములు-సాహిత్య పోషణము; ముఖబంధము. 23.

ఆశుధారా కవిత్వంబులందు శయన
లుపమ లుత్ప్రేక్షలును లేకయుండు గాన
ఎంత యోజించినను పద్యమంత సార
వంతమగు గాన-నిలుకడ వలయు కృతికి.[22]

కొప్పరపు సోదర కవులయొక్కగాని మరొకరి యొక్కయుగాని ఆశు కవితాప్రదర్శనము అప్పకవి మాటలను అపవాదము [23] చేయుచున్నదనుట ప్రశంసావాక్యము మాత్రమే.

ఆశుకవిత్వమునకు వలెనే అవధాన కవితలను గురించియు నట్టి యభిప్రాయమే కలదు.[24] అవి చేయువారికిని వినువారికిని తాత్కాలిక ప్రయోజనామోద సంపాదకములేగాని[25], భాషా వాఙ్మయములకు పుష్టిని చేకూర్చి కవికి నిశ్చలమైన కీర్తిని పాఠకులకింత విజ్ఞానమును కలిగించి జాత్యున్నతికి దోహదము చేయునవి కావు.

వనపర్తి సంస్థానమున ప్రభువుల యెదుట 'అత్యాశుధారలో' వ్రాసిన పద్యములలో వేంకటశాస్త్రి గారొక పద్యము నిట్లువ్రాసిరి:

కవిత యాశుగ జెప్పిన కారణమున
తప్పులుండెడి నయ్యవి తమదు పండి
తులును, తమకెదురాడిన దుడుకుతనము
తాము క్షమింపుటకు వేడెదము నరేంద్ర[26].

మరియు శతావధాన సారమును ప్రకటించుటకు ముఖ్యకారణము అవధానమన నెట్టిదో అందలి కవిత్వమెంత రసము తక్కువ కలిగియుండునో, అందు గోరెడి

22. అప్పకవీయము. 1.59.
23. కొప్పరపు సోదరకవుల చరిత్ర. 93.
24. తెనుఁగు కవిత. వ్యాసము. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. 1929. (18-3) పుట. 175.
25. చతుర్విధ కవితాచాతుర్య శతావధాని శ్రీమాన్ రత్నాకరం, అనంతాచార్యులు. ఉత్తర హరిశ్చంద్ర కావ్యము. మరియు "కవిగారి మనుగడ" 64
26. నానారాజ సందర్శనము. ఉత్తరార్థము 126.

కోర్కెలెంత విషమములుగా నుండునో అను విషయములు తేటతెల్లము కావలయు ననుటయే యనియు ఆశుధారాకవయితలకు సుప్రయోగవిచారణమే కాక రసారస విచారణమును నంతగా నుండదని కవితామర్మజ్ఞులకు స్పష్టమేకదా అనియును కూడ వ్రాసి అప్పకవి మాటకే ఆదరమును చూపినారు[27].

గుంటూరు కాలేజీ శతావధానమునకు అధ్యక్షత వహించిన శ్రీమాన్ వంగీపురం కృష్ణమాచార్యులు గారు అవధానానంతరము శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారిని ప్రశంసించుచు చేసిన హితోపదేశమును కూడ గమనింపవలెను.

నాదు హితోపదేశము మనంబున నొక్కెడ నిల్పియుంచుమా
మేదిని కూర్చినప్పటి నిమేషములోన శతావధాన సం
పాదిత పద్యజాలము లపారముగా ముదమిచ్చినన్ విచా
రోదిత దివ్యకావ్యముల యొప్పెటు కల్గి మనోహరములై
పాదుకొనంగజాలెడిని? పండితపామర హృద్యమై మన
స్స్వాదన మెంతయో గొలిపి సత్వరబుద్ధి జెలంగ నిశ్చలం
బై చనరారు టెట్లుమది? యట్లగుగాన ప్రబంధ మార్గమం
దే దగు యత్నముల్ సలుపనెంచుము, పావన నీతి మార్గమున్
చేదని వీడు వారలను చెన్నలరారు మధూక్తి పాళులన్
నీదగు నేర్పుజూపి మహనీయ విశుద్ధ వివేకమార్గమం
దే దిటవొప్పుచుండగ సుధీగతి దెల్పుచు గీర్తినొందుమా[28].

ఈ 1911 వ సంవత్సరము అవధానాశు కవితలల్లుట మీది వ్యామోహమును కన పరచి దాని వలని ప్రమాదమును హెచ్చరిక చేసిన సంవత్సరము. అంతకు పూర్వము అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారితో కలిసి 'జంటకవుల పోట్లాటలలో' ఆశుకవిత్వావధానము చేసిన[29] రాయప్రోలు సుబ్బారావుగారు - అది మోహపడ తగనది కాదని ఆత్మ సంబోధనము చేసికొన్న సంవత్సరమది.

27. శతావధాన సారము. ఉపోద్ఘాతము.
28. గుంటూరు కాలేజీ శతావధానము. 37.
29. నవ్యాంధ్ర సాహిత్యవీధులు. ద్వితీయ భాగము. 206.

"............
కపురంపుంబలుకుల్ దెనుంగులివి వేగ ప్రక్రియా ధోరణీ
విపరీతానిలధాటిలో చెరిగినన్ విధ్వంసమైపోవె త
ద్విపులామోదము మెత్తురే రసికులీ విన్యాస వైకల్యమున్"
"... వాగర్థ కలాకలాప జయలక్ష్మిన్ గాలికిం బుత్తునే!
జననీ! యేమిటికింక ఆశుకవితాసన్యాస మిప్పింపవే!"
"... సకలార్థ శూన్యమగు నీ వేగాతి వేగోక్తిదు
ర్వ్యసనం బేటికి త్రిప్పుమింక జననీ! రహ్యాక్షరక్షోణికిన్"30

ఈ యాత్మ సంబోధన వాక్యములలో అప్పుడు దేశమున వ్యాపించియున్న ఆశుకవితావ్యామోహ మెంత వెఱ్ఱిగా నుండెడిదో కూడ తెలియుచున్నది.

ఆశుకవిత్వమును గురించిన యభిప్రాయము లిట్లున్నవి.

మధుర కవితల విషయమున ప్రభాకరశాస్త్రి గారు వ్రాసిన వాక్యముల వలన అవి పండిత కవులచేత 'సత్కవితలలో' పరిగణింపబడలేదని[31] తెలియు చునే యున్నది కదా!

ఈ విధముగా చతుర్విధ కవితలందు మూడు విధములు కవులచేతను లాక్ష ణికుల చేతను కూడ ఉపేక్షింపబడినవి. ఇక మిగిలిన విస్తర కవితనొక్క దానినే వస్తుకవితగా నందరును ఆమోదించి దానినే ఇహపర సాధనముగా పెంచి పెద్దచేసికొనిరి.

అనగా ఆశు మధుర చిత్రకవితలు సజీవ ప్రౌఢ భాషా సాహిత్య చైతన్య ధారాప్రవాహ వాహములగుటకు సర్వసమర్థములు కావన్న మాట!

అయినను ఆశుకవితా సరస్వతులవతరించి అవధానములు చేసి ఆంధ్ర భాషా కవితకు – అందును ముఖ్యముగా తెలుగు పద్యమునకు కృతకలక్షణమును పోగొట్టి స్వభావ సౌందర్యమును కల్పించి – ఆధునిక జీవమును పోసినారు.

---

30. ఆధునికాంధ్ర కవిత్వము. 262, 63.
31. విజ్ఞాన సర్వస్వము. ఆరవ సంపుటము. 617.

# 2. ఆ శు క వి త లు

## 1. స్వ రూ ప ని రూ ప ణ ము

ఆశుకవిత్వమనగా నేమి ? "ఏకపాద - త్రిపాద - కఠినప్రాస - విషమ సమస్యాపూర్తులు - వ్యస్తాక్షరీ సంఘటిత పద్యంబులును - ఇష్టార్థ దేవతా వర ప్రతిపాది నిషేధాక్షర రచనా చమత్కృతియు, అష్టావధానంబులు - ఘటికా శతగ్రంథ కల్పనయు - ఆకాశ పురాణంబులని తత్కాలోచితాతి త్వరితగతిని రచియింపబడునది". ఆశుకవిత్వమని లాక్షణిక గ్రంథనిర్వచనము.[1] ఆశుకవిత్వ మనగా అతిత్వరితగతిని కవిత్వము చెప్పుట మాత్రమే కాదు. అది తత్కాలోచి తముగా నుండవలయును. అనగా కవి తాను వ్రాయ సంకల్పించిన కావ్యమును త్వరత్వరగా ఇంటివద్ద కూర్చుండి ఒకటి రెండు గంటలలో నాలుగైదు వందల పద్యములను నల్లి పూర్తి చేసికొనుట కాదు. ఇంటివద్ద కూర్చొని వ్రాసినది ఆశు కవిత్వము కాదు. ఒకానొక సమయమునందు ఒకానొకడు ఒకానొక విషయ మును చెప్పి దీనిని గూర్చి కవిత్వము చెప్పుమనగా, వెంటనే అతి త్వరితగతిని చెప్పబడినది ఆశుకవిత్వము. తత్కాలోచిత మన్నదానియందు వక్త-విషయము-విధానము మొదలైన బహ్వంశము లిమిడి యున్నవి. మరియు నాశుకవిత్వము చెప్పుమని కవిని ఎన్ని విధములుగా కోరవచ్చునో గూడ ఆ నిర్వచనమున యందున్నది. ఆశుకవిత్వము చెప్పెదనని ముందుకు వచ్చిన కవి ఆ తొమ్మిది విధానముల చెప్పుటయందును ఆరితేరినవాడు కావలయును. కవిత్వమునకు ఛందోబద్ధమైన పద్యరచన లక్షణము కనుక ఆశుకవిత్వమనగా ముందు పద్య రచనా ప్రావీణ్యమును కవి సంపాదించుకొన వలెను. ఇక్కడ ప్రావీణ్య మంతయు ముఖ్యముగా అతి త్వరితగతిని సాధించుట యందుండును. నెమ్మదిగా గణములను కూర్చుకొనుచు యతి ప్రాసల వద్ద ఆగి యాగి కష్టముమీద ముందుకు సాగుచు అరగంట కొక పద్యమైన దనిపించుట ఆశుకవిత్వమునకు లక్షణము కాదు. ఒక రమణీయమైన భావకల్పన చేయుచున్నాను గనుక పద్య మును నిదానముగా చెప్పుచున్నాననుటయు ఆశుకవికి లక్షణము కాదు. ఆశుగతి

---

1. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము. సాహిత్య సమీక్ష. పుట 3.

కల్పనమువల్ల ఆశుకవిత్వ మగుచున్నది గాని రమణీయ భావకల్పనము వల్ల ఆశుకవిత్వ మగుటలేదు. అతిత్వరిత గతియందును రమణీయ భావము వచ్చిన దనగా అది లాభము. లాభమునకని అసలునకు ముప్పుతెచ్చు వ్యాపారము చేయరాదు.

ఆశువునందు కరము మేటి[2] నని మొదట ప్రకటించుకొన్న గౌరవము పూర్వాంధ్ర కవులలో భట్టుమూర్తి నట్లుంచిన తెనాలి రామకృష్ణకవిదిగా కనుపించుచున్నది. ఆంధ్రభాషయం దాశుకవితా ప్రదర్శనము నిజానికి శ్రీనాథుని తోనే మొదలయిన దనవలయును. వేములవాడ భీమకవి చాటువుల సంగతి వేరు విషయము. అది క్రమముగా శ్రీ కృష్ణదేవరాయలవారి కాలమునకు వృద్ధియగుచు తంజావూరు రఘునాథరాయలవారి యుగమునకు చక్కగా పరిణమించినది.

ఆశుకవితా విశేషములుగా నింతకు ముందు పేర్కొనబడిన వాటిలో ఏకపాద త్రిపాదములు చిత్రకవితా విషయములు. ఇక మిగిలినవాటిలో ఘటికా శతగ్రంథ కల్పనము - ఆకాశపురాణము - సమస్యాపూర్తులు - ఇవి నిజముగా ఆశువులు. కఠిన ప్రాస కూడ అందులోనిదే. వ్యస్తాక్షరి, నిషేధాక్షరి అష్టావధాన ములో కలిసిపోయినవి.

అందువలన ఆశుకవితా ప్రదర్శనములు ఘటికా శతగ్రంథ కల్పనము గాను, సమస్యాపూరణముగాను, అవధానముగాను, ఆకాశ పురాణములుగాను ఉండెడివని చెప్పవలయును.

ఘటికా శతగ్రంథ కల్పనమనగా గడియకు నూరు పద్యములు చెప్పుట. అత్యాశు రచన చేయుటయన్న మాట. "ఘటికా సద్యశ్శత గ్రంథ కల్పనుడ" నని రామరాజభూషణుడు వ్రాసికొన్నాడు.[3] ఇది చేతనైన వానికి ఏకైక దిన ప్రబంధ కల్పనమొక లెక్కలోనిది కాదు. రామరాజభూషణుని తరువాత చాల మంది కవులు తాము ఘటికా శత గ్రంథ ఘటనా సామర్థ్యము కలవారమని

2. పాండురంగ మాహాత్మ్యము. 1-23. మరియు ముద్దుపళని; "ఆశుకవిత్వంబు లల్లితేనా సరా ?" రాధికా స్వాంత్వనము. 3-14. మరియు రత్నాకరం అప్పప్పకవి పెదతాత: "అతి చమత్కృతు లొప్ప నాశుకవిత్వంబుఁ జెలగి వాక్పటిమతో జెప్పునతడు". శశిరేఖాపరిణయము. 1-19.

3. వసుచరిత్రము. 1-16.

బాహాటముగా చెప్పకొనసాగిరి. తంజావూరు రఘునాథనాయకుడు పారిజాతాప హరణమను కృతిని ఆరుగంటల కాలములో ఆత్యాశువున చెప్పగా లేఖకు లతి కష్టముమీద వ్రాయగలిగినట్లు చెప్పబడినది.[4]

ఈదృశమైన ఆశురచనకు "సమయ లేఖిని విద్యాప్రదర్శన" మనియు పేరు కలదు. ఒక నిర్దిష్ట సమయములో ఒకానొకవిషయమును గురించి ఒక సంఖ్యా నియమమును పెట్టుకొని పద్యములు చెప్పుటయే దీనికి లక్షణము. గడియకు నూరు పద్యములన్న ప్రసిద్ధమైన నియమమీ సమయలేఖినికి సంబంధించినదే.[5] ఇరువది నాలుగు నిముషముల గడియ లేక ఘటిక తరువాత తరువాత గంటకు మారినది.

గడియకు నూరుపద్యములేమని ఘటికార్థముననే నూరుపద్యములు చెప్పుటకు సాధనచేసి సిద్ధిపొందిన ప్రాచీనులలో తంజావూరు రఘునాథరాయల వారి ఆస్థానము నలంకరించిన, మరియు ఆయనచేత స్వర్ణాభిషేక గౌరవము నందిన, మధురవాణిని ముందుగా పేర్కొనవలయును. ఆమె "మాధుర్యైక ధురంధరాంధ్రకవితా నిర్మాణ సమ్మాన్య".[6]

సమయ లేఖినితో పాటు శతలేఖినీ విద్యయును కలదు. శతలేఖినీ విద్యయే శతావధానము. "శతలేఖిన్యవధాన పద్య రచనా సంధా సురత్రాణ చిహ్నితనాముడ" నని చరిగొండ ధర్మన్న తనను గురించి వ్రాసికొనెను.[7] అవధాన శబ్దమునుకూడ కలిపినాడుగనుక తప్పక అది శతావధానమే కావలయును. దీనితో అవధానములు రెండు విధములయినవి. అవధానముల విషయము తరువాత.

సమస్యాపూర్తులు పద్యపూరణములు పాదపూరణములు అను పేర ఆశుకవితా వినోదములుగా చాలకాలము చెల్లుబడియైనవి. సమస్యలతో కలిసియు కలియకయు కఠినప్రాసలు ఆశుకవితా ప్రదర్శనములలో కొనసాగినవి.

---

4. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము. సాహిత్య సమీక్ష. 5.
5. దక్షిణదేశీ యాంధ్రవాఙ్మయము. సాహిత్య సమీక్ష. 14.
6. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము. 30.
7. చిత్ర భారతము. 1 - 18.

## 2. ప్రాచీన ఆశుకవులు

### 1. శ్రీనాథుడు :

"వెల్గోటిరాజును పండితకవియు నగు సర్వజ్ఞసింగ భూపాలు నాస్థానము నకుఁ బోయి యానృపాలుని కొల్వుకూటమునకు ముందు పూజింపబడు చుండెడు. శారదా విగ్రహమును గాంచి శ్రీనాథుడు చెప్పిన పద్యమును."[8] :

దీనార టంకాల దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్ర భాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునను
పగులగొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచు ఢక్క
చంద్రభూష క్రియాశక్తి రాయలయొద్ద
పాదుకొల్పితి సార్వభౌమ బిరుదు
ఎటులమెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగ మహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరస సద్గుణనికురంబ శారదాంబ.

శ్రీనాథుని చాటువులుగా ప్రసిద్ధము లయిన పద్యము లన్నియు కాకపోయినను : కొన్నియైనను ఆయన ఆయా సందర్భములలో ఆశువుగా చెప్పినవే కావలయును.

ప్రౌఢదేవరాయల యాస్థాన విద్వాంసుడైన ముమ్మకవి శ్రీనాథునినడిగెను. "అయ్యా ! మీరు రెడ్డిరాజుల యాస్థానమున విద్యాధికారిగా నుంటిరిగదా ? మీ బిరుదులేమి ? తెలుపరై తిరే" యని. శ్రీనాథుడిట్లనెను : [9]

---

8. చాటుపద్య మణిమంజరి. ప్రథమ భాగము. పుట 116.

9. శృంగార శ్రీనాథము. 183.

తరువున గాండివం బిడదె ధర్మజునానఁగిరీటి, యేను వా
క్సరసిజనేత్ర యానతి విచారము చొప్పున గర్వహీనతన్
మరలి తెనుంగుభూమి కసమానగతిన్ గొనిపోవువాడనై
బిరుదులు నారివాగుకడ బెట్టితి సత్కవి సార్వభౌముడన్.

ఇది యిట్టి సందర్భమున ఆశువుగా చెప్పబడినదివలెనే యున్నది కదా!

## 2. పెద్దన :

శ్రీకృష్ణ దేవరాయలు తనయాస్థాన మహాకవుల ముందొకనాడు గండ పెండేరము నుంచి సంస్కృతాంధ్రముల యందు సమముగా కవిత చెప్పనేర్చిన వారు దీనిని పరిగ్రహింపుడనగా నెవరును మాటాడలేదు. అప్పుడు రాయలవారు

"ముద్దుగ గండపెండియరమున్ గొనుడంచు బహూకరింపగా
నొద్దిక నాకొసంగుమని యొక్కరుఁ గోరగలేరు - లేరొకో"—

అని యనుచుండగా పెద్దనగారు లేచి

"పెద్దనబోలు పండితులు పృథ్విని లేరని నీవెఱుంగవే!
పెద్దన కీఁ దలంచినను పేరిమినాకిడు కృష్ణరాణ్ణృపా!

అని పద్యమును పూర్తిచేసెను. రాయల వారాశువుగా చెప్పినదాని నందుకొని పెద్దన్నగారును ఆశువుగానే పూరించినారు గదా! మరియు నా సందర్భముననే సంస్కృతాంధ్రభాషల యందు తనకున్న కవితాశక్తిని ప్రకటించుచు చెప్పిన ఉత్పలమాలికా పంక్తులు ఇరువది తొమ్మిదియును ఆశుకవితయే.

పూఁతమెఱుంగులుం బసరు పూఁపబెడంగులు జూపునట్టివా
కైతలు? జగ్గునిగ్గు నెనగావలెఁగమ్మన గమ్మనన్వలెన్
రాతిరియున్ బవల్ మఱపురాని హొయల్ చెలియారజంపు ని
ద్దాతరి తీపులో యనగ దారసిలన్వలె లోఁదలంచినన్
బాఁతిగ పైకొనన్వలెను బైదలికుత్తుకలోని పల్లటీ
కూత లనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
చేతికొలంది కౌగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్ని మేల్
మూతల చన్నుదోయివలె ముచ్చటగావలె పట్టిచూఁచినన్
డాతొడనున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ

వాతెఱ దొండపండువలె వాచవి గావలె పంటనూదినన్
గాతల తమ్మిచూలిదొర కైవసపుంజవరాలి సిబ్బెపున్
మేతెలి యబ్బురంపు జిగినిబ్బర పుబ్బగు గబ్బిగుబ్బ పొం
బూతల నూనెకాయ సరిపోడిమి కిన్నెరమెట్టు బంతి సం
గాతపు సన్నతంతి బయకారపు కన్నడ గౌళపంతకా
సాతత తానతానల పసన్ దివుటాడెడు గోటమీటు బల్
ప్రోతలనుంబలెన్ హరువు మొల్లముగావలె నచ్చతెల్గు లీ
రీతిగ ... ... ... ... ... ... ... ... ... ... ... ...
.........సంస్కృతంబు పచరించెడు పట్టున భారతీ వధూ
టీ తపనీయగర్భ నికటీభవ దానన్నపర్వ సాహితీ
భౌతిక నాటకప్రకర భారత భారతసమ్మత ప్రభా
పాత సుధాప్రపూర బహుభంగ ఘుమం ఘుమ ఘుం ఘుమార్భటీ
జాతక తాళయుగ్మ లయసంగతి చంచు విపంచికామృదం
గాతత తేహిత త్తహి తహోధిత ధంధణుధాణు ధింధిమి
వ్రాత నయానుకూల పదవార కుహూద్వహహారి కింకిణీ
నూతన ఘల్ఘలా చరణ నూపుర ఝూళ ఝుళీ మరంద సం
ఘాత వియద్ధునీ చకచక ద్వికచోత్పల సారసంగ్రహా
యాత కుమార గంధవహహారి సుగంధవిలాస యుక్తమై
చేతము చల్లఁజేయవలె జిల్లన జల్లవలెన్ మనోహర
ద్యోతక గోస్తనీఫల మధు ద్రవ గోఘృత పాయస ప్రసా
రాతిరసప్రసార రుచిరప్రసరంబుగ సారె సారెకున్.

ఇక్కడ ఒక్క విషయమును గమనింపవలెను. ఆశుకవిత్వమును ఒకే ఛందస్సున మాలికారూపమున చెప్పవచ్చును. వివిధములయిన ఛందస్సులలోను చెప్పవచ్చును. అంతేగాని మాలికారచనయే ఆశుకవిత్వముకాదు. మాలికా కవిత్వమన్నదొక ప్రత్యేకమైన కవితాశాఖ కాదు.[10] అయినచో ద్విపదవాఙ్మయమంతయును మాలికా కవిత్వమేకదా! ఛందస్సు పేరుమీద వాఙ్మయ ప్రతిష్ఠాయోగమొక్క ద్విపదకే పట్టినది. మరొక ఛందస్సునకది లేదుకదా.

10. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము. సాహిత్య సమీక్ష. 14

3. భట్టుమూర్తి :

లొట్టి యిదేటిమాట పెనులోభులతో మొగమాటమేల తా
గుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరిపుర్వని యందురేకదా :
పట్టపురాజు పట్టి సరిపల్లె సరాసరి యీయకున్న నే
దిట్టకమాన నామతము తీవ్రమహోగ్ర భయంకరంబుగా
దిట్టితినా మహాగ్రహమతిన్ మకరగ్రహ జర్ఝరీభటా
పట్టన దట్ట ఫాలఫణి భర్తృ బహూకృత పర్జటస్ఫుటా
ఘట్టపు దట్టణాల కవిఘట్ట నిరర్గళ రాజభృత్యకీ
చట్టచటార్భటీనయన ఙర్ఝరకీలలు రాలగావలెన్
చుట్టజీకంబునంబొగడ జూచితినా రజతాద్ర్యధిత్యకా
పట్టణ మధ్యరంగ గత భవ్యవధూ వదనానుషంగ సం
హట్ట శిరస్స్రగాంగ ఝురహల్లకజాల సుధా తరంగముల్
చుట్టుకొనన్వలెన్ భువనచోద్యపుగా సదయంబుగా మఱిన్
దిట్టితినా సభాభవనధీంకృత భీమనృసింహ రాడ్ధ్వజా
తాట్ట మహాట్టహాస చతురాస్య సముద్భ్రుకుటీ తటీనటీ
కోట్టణ రోషజాల హృత కుంఠితకంఠ గభీరనాద సం
ఘట్ట విజృంభమాణగతి గావలె దీవన పద్యమిచ్చి చే
పట్టితినా మణీ కనకభాజన భూషణ భాసురాంబరా
రట్ట తురంగ గంధగజరాజదమూల్య ఘనాతపత్ర భూ
పట్టణ భర్మహర్మ్య భటపంక్తి చిరాయురనామ యంబునై
గట్టిగ తోడుతో వెలయగావలె నెక్కువటీవి జూడుడీ
యట్టిటు మందెమేలముల నందఱనుం బలెఁజుల్కఁజూచి నే
పట్టననైన గేరడము పల్కుకుడీ పయిపెచ్చునందులన్
గొట్టుదు దుష్కవిద్విరద కోటుల పంచముఖోద్భటాకృతిన్
బెట్టుదు దండముల్ సుకవిబృందము కే నతిభక్తి సారెకున్
గట్టితి ముల్లె లేబదియు గాగల నూటపదాఱు లెయ్యేడన్
రట్టడి భట్టుమూర్తి కవిరాయని మార్గమెఱుంగ జెప్పితిన్.

2)

ముందు నిప్పడు నికమీద మోద మలర
పద్యదండంబు చేబూని పార్థివులను
చంపుచున్నాడు చంపును చంపగలడు
పరుషవాక్యత సమవర్తి భట్టుమూర్తి.

## 3. సమస్యా పూరణములు

సమస్య :

కుక్కవా ? నక్కవో ? ఫణివా ? కోతివా ? పిల్లివా ? బూతపిల్లివో ?

పద్యపూరణము :

తక్కక రావుసింగ వసుధావరు దర్థుల కర్థమిచ్చుచో
దిక్కనులేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమాను పెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుని నెన్నుదు భట్ట! దిట్టవై
కుక్కవో ? నక్కవో ? ఫణివో ? క్రోతివో ? పిల్లివా ? భూతి పిల్లివో ?

సర్వజ్ఞ సింగభూపాలుని యాస్థానమున నొక భట్టుకవి శ్రీనాథున కా సమస్య నిచ్చినట్లును, ఆయన దానినిట్లు పూరించినట్లును ప్రసిద్ధియున్నది.[11] అంతకు మించి ఆ కాలమునందలి సమస్యా పూరణముల విషయము మనదాక రాలేదు. శ్రీనాథయుగము నందున్న అనంతామాత్యుడు భోజరాజుయొక్క ధారా నగర మహిమను వర్ణించుచు నిట్లొక పద్యము వ్రాసినాడు. "కైపదమిచ్చు వారలును గ్రక్కున పద్యము చెప్పువారలున్"[12] కైపదమన్నను కయిపదమన్నను కవితా శక్తిని పరీక్షించుటకై పూరింపనిచ్చెడి పద్యాంశము, సమస్య.[13] ఈ యర్థమా ప్రకరణమున భోజమహారాజు కాలము విషయముగా నున్నది. అది అనంతామాత్యుని కాలమునందున్న విషయముగానే మనము గ్రహించుట ఆ తరువాత. ఈ పరిస్థితులలో ఆశుకవిత్వమును - సమస్యా పూరణమును శ్రీనాథునితో మొదలుపెట్టి చెప్పవచ్చును.

---

11. చాటు పద్య మణిమంజరి. ప్రథమ భాగము. 117
12. భోజరాజీయము. 2. 50.
13. సూర్యరాయాంధ్ర నిఘంటువు. 2. 456.

ఇక రాయలవారి కాలమున తెనాలి రామకృష్ణుడు చేసిన సమస్యా పూర ణములే ఒకటి రెండు ఇప్పటిదాకా నిలిచి వచ్చినవి.

**సమస్య :**

కుంజర యూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్

**పద్యపూరణము :**

గంజాయి త్రాగి తురకల
సంజాతుల గూడి కల్లు చవిగొన్నావా ?
లంజల కొడుకా యెక్కడ
కుంజర యూథంబు దోమ కుత్తుక జొచ్చెన్ ? 14

ఆ సమస్య నిచ్చినది భట్టుమూర్తి యనియు రామకృష్ణుడు నిర్లక్ష్యము గాను నిందాత్మకముగాను దానినట్లు పూరించెననియు, అది మర్యాదపద్ధతిగా లేనందున రాయలు కోపించి ఆ సమస్య తానిచ్చినదియనియు చక్కగా పూరింప మనియు ఆజ్ఞాపింపగా అప్పుడు రామకృష్ణ కవి

రంజన చెడి పాండవులరి
భంజనులై విరటుగొల్వఁ బాల్పడి రకటా!
సంజయ ! యేమని చెప్పుదు
కుంజర యూథంబు దోమ కుత్తుకఁ జొచ్చెన్

అని పూరించి రాయలవారి నానందపరచెనట!

అన్నాతిఁ గూడ హరుడగు
నన్నాతిం గూడకున్న నసురగురుండౌ
అన్నా ! తిరుమలరాయడు
కన్నొక్కటి లేదుగాని కంతుడు గాడే.

చివరి పాదము సమస్యగా నీయబడినదనియు దానిని రామకృష్ణు డట్లు పూరించెననియు చెప్పుదురు. కాదు, స్వభావ మధురమైన వర్ణన యనియు చెప్పుదురు.

---

14. చాటుపద్య మణిమంజరి. ప్రథమభాగము. 146.

సమస్య :

రవి గాననిచోఁ గవి గాంచునే కదా !

పద్యపూరణము :

ఆరవి వీరభద్రు చరణాహతి డుల్లిన బోసినోటికిన్
నేరడు రామకృష్ణకవి నేరిచెఁబో మన ముక్కుతిమ్మరాట్
క్రూర పదాహతిం దెగిన కొక్కిరి పంటికి దుప్పికొమ్ము ప
ల్గా రచియింపనేర! రవి గాననిచో కవి గాంచునే కదా! 15

ఈ సమస్య వెనుక ఒక చిన్న కథ యున్నది. ముక్కు తిమ్మన రామకృష్ణకవి నెందుకో రెండు తన్నులు తన్నెను. ఆ దెబ్బకు రామకృష్ణుని పన్నొకటి విరిగినది. దానికాతడింటికి పోయి దుప్పికొమ్ము నరుగదీసి పల్లుగా నదుకుకొనెను. ఈ కథ ఆ పద్యమున చమత్కరింపబడినది. దక్షయజ్ఞ ధ్వంసమున వీరభద్రుడు తన్నగా సూర్యుని పండ్లను రాలినవి. దుప్పికొమ్మలు పెట్టుకొనుట రవికి తెలియలేదు. రామకృష్ణ కవికి తెలిసినది. రవి గాననిచో కవి గాంచునే గదా ! అనగా నది - ఆ పద్యము నెవరు పూరించినదియు తెలియదు.

రాయల యుగమున నిట్లున్న సమస్యాపూరణము తంజావూరు నాయక రాజుల కాలముననను ఆ పిమ్మటను మిక్కిలి వ్యాప్తినందినది.

ఒక పాదము నిచ్చి మిగిలిన పాదములను పూరింపుమనగా అర్థ సమన్వయము చేసికొని తదనుగుణముగా సద్యఃకాల బుద్ధి వైభవమును ప్రదర్శించుచు మూడు పాదములు చెప్పుట నిజముగా కవి కదియొక సమస్యయే. కవికి సమస్యను కల్పించెడు పద్యపాదము తానును సమస్యయే కావలసివచ్చినది.

రఘునాథాభ్యుదయము — విజయరాఘవ కల్యాణము - కవిజనోజ్జీవిని- మొదలైన కృతుల యందు రఘునాథ రాయల వారి కాలమునయందును, విజయరాఘవ నాయకులవారి కాలముననను, పుదుక్కోట కోటి రఘునాథ నాయకుల వారి కాలముననను, విద్వద్గోష్ఠులలో జరిగిన సమస్యాపూరణము లుదాహృతములై యున్నవి. మచ్చునకు కొన్ని చూపబడుచున్నవి.[16]

15. చాటుపద్య మణిమంజరి. ప్రథమభాగము. 144.
16. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము. సాహిత్య సమీక్ష.8-12.

1. సమస్య : రారాజని యచ్యుతేంద్ర రఘునాథ నృపా.

పద్యము : ఏరీ నీసరి రాజులు
భూరమణులు నిన్నుఁ జాలఁ బొగడుదురు భళీ
"స్వారా" జని "రేరా" జని
"రారా" జని యచ్యుతేంద్ర రఘునాథ నృపా!

ఈ పద్యము నిట్లు పూరించినది రామభద్రాంబ.

2. సమస్య : మీసానకుఁ గాళ్ళుమూడు మేదిని గల్గెన్.

పద్యము : మీసానకుఁ గాళ్ళెక్కడ
వాసిగ విన్నదియు లేదు వసుధాస్థలిలో
వాసన గంధము రాచెడు
మీ సానకుఁ గాళ్ళు మూడు మేదిని గల్గెన్.

3. సమస్య : వాలిలిలోఁ ద్రోయఁ గ్రోతివలెనే యుండెన్.

పద్యము : ఓ విద్వన్మణి నను సు
గ్రీవుని యన్నకును బేరెఱింగింపుము రూ
పేవిత మనియెదు మధ్యము
వాలిలిలోఁ ద్రోయఁ గ్రోతివలెనే యుండెన్.

మధ్యము వాలిలిలోఁ ద్రోయ - అనగా వావిలో నున్న మాధ్యమాక్షరమును త్రోసివేయగా నని యర్థము అప్పుడు "వాలి" యగును.

దక్షిణాంధ్ర వాఙ్మయము రోజులు గతించిన తరువాతచి న్నచిన్న సంస్థానముల యందును కవి పండిత పోషణము కొనసాగినచోట్ల ఆశు కవితా ప్రదర్శనములును సమస్యా పూరణములును మంచి గిరాకీతోనే చెల్లుబడియైనవి.

# 4. ఆధునికాశుకవులు

## 1. ఆశుకవితా సరస్వతులు :

ఆశుధారా కవిత్వాడంబరంబన్న
"నల్లేరుపై బండినడక మాకు
........................
ఆశుధారా కవిత్వమ్ము నందుకొంటి
మేని యభిసారికయు దండమిచ్చితీఱు. 17

మరియు తిరుపతి వేంకట కవుల యాశు కవిత యందలి విశేషమేమనగా చెరి యొక పాదముగా పద్యము నిరువురును అందుకొని చెప్పుకొనిపోవుట. ఒకరు మొదలు పెట్టిన భావములోని ఉద్దేశ్యము నింకొకరు గ్రహించి రెండవ పాదమును వెంటనే అందుకొనుటయు మొత్తము మీద పద్యమొక తాత్పర్యమునంది రమణీయముగా నుండుటయు ఆశ్చర్యకరమైన విషయములు. ఆ విషయమును వారే యొకసారి గద్వాలలో ప్రకటించిరి.

ఒక చరణంబతండు మఱియొక్కటి నేను మఱొక్కటాతడున్
సకల కవీంద్ర సంతతులు సమ్మతిచే తలలూచి మెచ్చగా
ప్రకట తరాశుధీర దనరన్ రచియింపగ నేర్తుమయ్య "నూ
టికి" సెలవయ్య నిక్కమిది డెబ్బది మాటలు సెప్పనేటికిౕ.

మా కవిత్వ పరీక్ష సమ్యగ్గతిని రచింపుము-
ఏ కథ నేనియు జెప్పనపుడు
చేయి యాపిన నది తెగవేయు మాధిప

అత్యాశువున నొక కథను కల్పించుకొనుచు కావ్యమును వ్రాసికొనిపోవుట "ఆగకుండ వ్రాసికొనిపోవుచున్నాడా" "ఆలోచించుకొనుట కాగుచున్నాడా" అన్నది పరీక్ష. వ్రాసెడు చేయి ఆగినదో దాని నక్కడ తెగవేయుమని వనపర్తి సంస్థానమున ప్రభువులను తిరుపతి వేంకట కవులు సవాలుచేసి నెగ్గుకొని వచ్చినారు.

---

17. నానారాజ సందర్శనము. పూర్వార్ధము. 16-17

ఆశుకవులందరును పరీక్షలకు నిలబడి అవధానాదికములను చేయలేరు. ఆ విషయమును తిరుపతికవులే ఇట్లు చెప్పినారు.[18]

నూటికొక్కఁడు చక్కని ధాటిగల్గి
సరస కవనమ్ము చెప్పెడి చతురుఁడుండు
అట్టివారలలో వేయి కమరు నొకడు
శతవధానాదికమ్మును సల్పు జాణ.

ఆ కాలమున ఆశువు నెందరు చెప్పగలిగిన కవులుండెడివారో లెక్కఁబెట్టలేము. అవన్నియును తాత్కాలికములైన మెఱుపులు గనుక శూన్యమున కలసిపోయినవి. అప్పుడు చాలమంది అవధానులు గూడ బయలుదేరిరి. వారిలో ఉద్దండులైన విద్వాంసులయొక్క అవధానాదికములయిన ఆశుకవితలే కొన్నికొన్ని మాత్రమే ఇప్పు డుపలభ్యమానముగా నున్నవి. చిల్లర మల్లర యవధానులందరును ఆ మరునాటి నుండియే మరుగున పడిపోయిరి.

తిరుపతి వేంకట కవుల ఆశుకవితా ప్రదర్శనములలో ప్రధానముగా పేర్కొనదగినది ఆకాశ పురాణము. వారి అష్టావధానములు అంతరక్తిగట్టుటకు వారి పౌరాణోక్తి కవిత్వాశువే ప్రధాన కారణము. ఆకాశ పురాణమనగా అప్పటి కప్పుడొకరు చెప్పిన కథావిషయము నాధారము చేసికొని, పురాణ గ్రంథములోని పద్యములను చూచి చదివినంత వేగముగా పద్యములను గద్యములను చెప్పుచు మరల పురాణధోరణిలో ఆ గద్యపద్యముల కర్థము చెప్పుట. మరల ఆశువుగా పద్యములనందుకొనుట. తామిద్దరగుటచేత నొకరు గ్రంథమును చదువుచున్నట్లు ఆశువున పద్యములు చెప్పుటగా, మరొకరా పద్యముల కర్థము చెప్పినట్లు పురాణము చెప్పుటగా తిరుపతి కవు లాకాశపురాణమును నిర్వహించెడివారు. వేంకటగిరి యవధానములో చేసిన రాజావారి రామేశ్వరయాత్రా కథాత్మకమైన ఆకాశ పురాణ కాలక్షేపము చాల ప్రసిద్ధమైనది. ఆ సందర్భమున చెప్పిన మొత్తము నలుబదియారు గద్య పద్యములలో పదునారు సీసపద్యములున్నవి.

ఆశుకవితా విశేషముగా పూర్వులు భావించిన వ్యస్తాక్షరిని నిర్వహించుట యందును తిరుపతికవు లందెవేసిన చేతులు. ఈ విషయమున తాను ధురీణుడనని

18. నానారాజ సందర్శనము. ఉత్తరార్థము 128, 126

ప్రకటించిన పూర్వాంధ్రకవి భట్టుమూర్తిగానే కనుపించుచున్నాడు. ఆ ప్రదర్శన స్వరూపము మనకు తెలియకుండనే పోయినది.

సంఖ్యా క్రమము ననుసరించి ఆయా అక్షరములను తిన్నగా నొప్పగించుటయే గనుక వ్యస్తాక్షరికి ఏ భాషాపదములనైనను వాడవచ్చును. అర్థముతో నవధానికి నిమిత్తములేదు. ఈ కీలకము మీద తిరుపతికవు లన్యభాషాపదముల నాహ్వానించెడివారు. అది సదస్యులను మరియు నాశ్చర్య చకితులను చేసెడిది. నానా భాషా పదములను గూడ వారామోదించి చేసెడువారు.

యూయం తంత్రసిడౌర్ తథాపి వెరివెల్
తస్మా న్మమాయం శశీ
నోగాసార్ మదరాసు కాయకరితం
హింగేందు బాయెందునం
నింగత్పూరయ నింగకూద విడుదల్
నీవాడ నంటింగదా
కిస్వాస్తే మయి బోల్తహుం అజి సునో
తక్సీర్ న మేరే ఉపర్.

అట్టావదానిగళ్ శెయ్యవల్లే మెన్ద్రవై పుహుందు
తట్టామలేశిలర్ తత్తళిప్పార్ విల్లితన్ శరంబోల్
ఎట్టేపుహుంద్రు పిన్నెట్టె ట్టెట్టె ట్టింగవరై యొప్ప
ముట్టాదు శెయ్యవల్లారిల్లె యెయింద మొయిణింలత్తె.[19]

నానా భాషా పదసంకులమైన మొదటి శార్దూల విక్రీడితమును, రెండవదైన ఈ తమిళభాషా పద్యమును వ్యస్తాక్షరి కుపయోగింపగా తిరుపతికవులు తిరిగి ఒప్పచెప్పి నారనగా ఆ బుద్ధిబలము నెవడెరుగవలయును ? డెబ్బది యారక్షరముల తోడి పదములను చెల్లా చెదరుచేసి అప్పడొకటి అప్పడొకటి చూపింపగా చివరకు క్రమము తప్పక చెప్పినది సంస్కృతాంధ్ర భాషలు కానప్పుడు పరమాశ్చర్యకరముకదా ! రెండవదైన తమిళ పద్యము తిరుపతి కవుల ఆశు కవితా శక్తిని అర్జునుని బాణవర్షముతో పోల్చి ప్రశంసించు నదియట !

19. ఉపాధ్యాయోపయోగినీ పత్రిక. శతావధాన సారము - అనుబంధము 152.

తిరుపతి కవులు నిషిద్ధాక్షరిని నిర్వహించినారుకాని ఉదాహరించుటకు వీలులేదు. శతావధాన సారమున (121) నిషిద్ధాక్షరి యని ఒక శ్లోకమున్నది. ఏ యే అక్షరములు నిషిద్ధములైనవో తెలియదు. నిషేధించిన అక్షరములు రాకుండ చెప్పిన శ్లోకమే యది.

ఇట్లాశుకవితా విశేషములన్నియును తిరుపతికవులయందు మూర్తీభవించినవి.

## 2. కొప్పరపు సోదర కవులు :

ఆలోచించుటలేదు కల్పనకు పద్యారంభయత్నంబు ము
న్నెలే, దించుక ప్రాస కేనియతి కేనినిన్ గొంకు కన్పట్టదే
యాలస్యంబును కల్గబోదు భళిరా! అయ్యారె! యివ్వారికిన్
జాలె యౌజుమి యాశుధార కవితా ప్రారంభ నిర్వాహముల్

కొప్పరపు సోదరకవుల ఆశు కవితా పాటవమును చూచి శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఆశ్చర్య చకితులై ప్రశంసించుచు చెప్పిన పద్యమది. వారిదే మరొక పద్యము.[20]

నాల్కకు తుదిన్నిరంతరము నాట్యము సల్పుటకీ సహోదరుల్
పల్కు వెలందినెట్లు తొలిబామున గొల్చిరొ? తేటతేనియల్
చిల్కిన యట్లు విందొసగు చెప్పిన పద్యములెల్ల వహ్వారే
పల్కిన పల్కులన్నియును పద్యములయ్యెడు నేమి చెప్పుదున్.

ఘటికాశత గ్రంథ కల్పనమన్నదానిని సార్థకము చేసిన ఆశుకవి సింహము లీ సోదరకవులు. "ఒక మారు పన్నిదమునకై మార్టేరు సభలో గంటకు 500 పద్యముల చొప్పున అరగంట కాలములో మను చరిత్ర ఆశువుగ రచించి తమ యనుపమాన ఆశుకవితా ప్రతిభ వెల్లడి చేసియున్నారు.[21]"

ఈ సోదరకవుల ఆశుకవితా ప్రదర్శన విశేషములను శ్రీ నిడుదవోలు వెంకటరావు పంతులుగారిట్లు తెలియజేయుచున్నారు.[22]

---

20. కొప్పరపు సోదరకవుల చరిత్ర. 27-119.
21. కొప్పరపు సోదరకవుల చరిత్ర. 93.
22. కొప్పరపు సోదరకవుల చరిత్ర. 74.

1. పద్యములు కోరినవృత్తములలో చెప్పుట: సోదరకవులు సాధారణ వృత్తములేగాక అసాధారణ వృత్తములను ఆశుకవితలో చెప్పుదురు. 2. వర్ణనలు కోరినవి చేయుట. 3. కథాసందర్భమున కల్పనలు 4. ఏదేని కథాఘట్టమును తీసికొని కవితా రచన చేయుట. 5. కేవలమొక కథనే కావ్యరూపమున చెప్పుట.

ఒకే కథ నాశుకవితలో చెప్పుకవులను "కథాశుకవు" లందురు. క్రీ. శ. 1730 ప్రాంతముల మధురలో కుందుర్తి వెంకటాచలకవి యను కథాశుకవి యుండెను. నేటికి మన కొప్పరపు కవులు కథాశు కవిచక్రవర్తులు. సీతాకల్యాణము - భీష్మజననము - అభిమన్యువధ - కంసవధ - హైమవతీ పరిణయము మొదలయినవి సోదరకవుల కథాశుకావ్యములు.

ఆశుకవిత్వంబు నల్లఁ బూనెదరేని
అద్దాని మించి చేయంగలేమొ ?
అష్టావధానంబు నాచరించెదరేని
అద్దానిమించి చేయంగలేమొ ?
శతఘంట కవనంబు సల్పబూనెదరేని
అద్దానిమించి చేయంగలేమొ ?
నేత్రావధానంబు నేర్పుచూపెదరేని
అద్దానిమించి చేయంగ లేమొ ?
ఆంధ్రమున నిన్నియన్ని పద్యములటన్న
నింతకాలంబులో నన్న నిందఅన్న
నిట్టి వర్ణోత్కరంబన్న నేమి వెఱపు ?
తెలుఁగు మీసంబు నిలుపంగ దివురుడింక.[23]

తిరుపతి వేంకట కవులతో వచ్చిన వివాద సందర్భమున సోదర కవులు సవాలు చేసి పిలిచిన పద్యమది.

తిరుపతి కవుల తరువాత పేర్కొన వలసిన ఆశుకవులు శ్రీ కొప్పరపు సోదర కవులు. వారు శతావధానులు కాగా వీరు ఆశుకవిత్వావధానులు.[24]

---

23. కొప్పరపు సోదర కవుల చరిత్ర. 41.
24. నవ్యాంధ్ర సాహిత్య వీధులు. ద్వితీయ భాగము 323.

### 3. పిశుపాటి చిదంబర శాస్త్రి :

శ్రీ పిశుపాటి చిదంబర శాస్త్రి గారు సంస్కృతాంధ్రములయందు రెంటను ఆశుకవిత ననాయాసముగా చెప్పనేర్చి ఆశుకవి కేసరి బిరుదమునందిన వారు. శ్రీ శాస్త్రిగారు తెలుగుదేశమును దాటి కర్ణాటక, ద్రావిడ, మళయాళ,కాశీ,దర్భాంగాది మండలములకు కూడ పోయి తమ సంస్కృతాశు కవితా ప్రదర్శనము చేత జయించుకొని వచ్చిరి. తెనుగునాట ఆగిరిపల్లి - గుడివాడ - యాదగిరి-కారుమంచి - జగ్గయ్యపేట - కాకినాడ - వరంగల్లు - పెద్దాపురము - దొంతి-గణపురము - ఏలూరు - మైలవరము - భువనగిరి - గద్వాల - ముక్త్యాల - నెల్లూరు - తిరుపతి - పిఠాపురము - విజయవాడ - సికింద్రాబాదు - విజయనగరము మొదలుగా గలిగిన మహానగరములందష్టావధానములు శతావధానములు చేసిరి. ఆశుకవిత యందు వీరందె వేసిన చేయి.

ఆశుకవిత్వంబు నల్ల బూనితినేని
హరిదశ్వవాహంబు లడలవలయు
అష్టావధానంబు నాచరించితి నేని
అష్టమూర్తులు శివాలాడవలయు
శతవధానమును సలుప బూనితినేని
శతధృతి ధైర్యంబు సడలవలయు
నేత్రావధానంబు నెఱవేఱిచితినేని
చక్షుశ్రవుండైన జంకవలయు
సంస్కృతాంధ్ర ప్రబంధ ప్రచారమునకు
దంటతన మేర్పడగ పూనుకొంటినేని
అంబనామోల తాండవంబాడవలయు
భూరిగుణజాల ! పీఠికాపుర నృపాల.

ఇది పిఠాపురము రాజావారిని దర్శించినప్పుడు చెప్పినది.

శ్రీ శాస్త్రి గారు గద్వాల సంస్థానమునకు పోయినపు డక్కడ భుజంగా రెడ్డి యనునొక ఆశుకవి శాస్త్రి గారి నెదుర్కొనెను. వాగ్వివాద మాశువుగా సాగుచున్నది. భుజంగా రెడ్డి వెనుకబడుచున్నాడు. ఆశువు ఆశువుగా సాగుట లేదు. అప్పుడు చిదంబరశాస్త్రిగారందుకొని విజృంభించినాడు.

తడ బడెద వేల ? ఆశువు
నుడువుటకై పూసుకొని ఘనుల్ గల సభలో
కుడి యెడమ లేదె ? సింహము
కడనా హరిణముల కుప్పిగంతుల యాటల్.

శతపధాన విధాన చాకచక్యము జూప
గలరేని రండు వాక్కలహ మేల !
అష్టావధాన విద్యాపాటవము జూప
గల రేనిరండు వాక్కలహమేల ?
ఆశుధారా కవిత్వాటోపమును జూప
గలరేని రండు వాక్కలహమేల ?
సంస్కృతాంధ్ర గ్రంథ సంధానమును జూప
గలరేని రండు వాక్కలహమేల ?
చతురమతి యగు గద్వాల జనవిభుండు
సాక్షియై యుండ నేతత్సభాంగణమున
తారతమ్యం బెఱుంగక తప్పుదారి
బడిన మీ గర్వమెల్లను బాపువాడ.
కవులమను గర్వమున కన్నుగానకుండ
నిన్న మొన్నటి దాక ననేక గతుల
సంతరించితి రికమీద సాగబోవు
వచ్చి యున్నాడు శ్రీ చిదంబరుడు నేడు.

భుజంగారెడ్డి తన యోటమి నొప్పుకొని "నీదగు నఖండ కవిత్వ మహా ప్రభావ సాగరమున కోడి ఱిచ్చవడి గౌరవబుద్ధి చెలంగు చుండ నీ చరణములంటి మ్రొక్కితిని సైపుము నేను భుజంగ రాయుడన్" అని పసపురాతి భుజంగారెడ్డి వ్రాలు అని సంతకముతో వ్రాసి సమర్పించినాడు.[25]

మరియు శ్రీ శాస్త్రి గారు గద్వాల ప్రభువుల యెదుట తమ సామర్థ్యము నిట్లు స్పష్టముగా ప్రకటించిరి.

---

25. శ్రీమదాంధ్ర పద్మ పురాణము. ప్రథమ సంపుటము,
కవి జీవితము 16.

ఖాండవమున్ ధనంజయ ముఖంబున వేల్వగ నీ సమస్త భూ
మండలమున్ జయింపగ సమర్థత పార్థుడు దాల్చినట్టు లొ
క్కండన నేన తాల్తు నధికారము నాశుకవిత్వమల్ల ను
ద్దండ శతావధానము ప్రధాన విధిన్ బొనరింప భూధవా!
గంటకు నిన్నియన్నియని గట్టిగనొక్కి వచింపనేల ? ని
ష్కంటకరీతి నొరుక్షణకాలము గూడను నాగకుండ నొ
క్కంటను దప్పకుండ నొడికంబుగ నేరచియింతు భూప ! మీ
వంటి రసజ్ఞులెల్ల "వహవా" "వహవా" యన నాశుపద్యముల్
ప్రాసము దప్పకుండ యతిభంగము వాటిలకుండ నర్థ వి
న్యాసము మాఱకుండ గమనమ్ము గణమ్ము తొలంగకుండ ను
ల్లాసముతోడ నాశుకృతులన్ గురియించుచు నుండుపట్టునన్
వ్రాసెదనంచు బూనుకొను వానికి జేసెద శృంగభంగమున్.

ఆనాటి ఆశుకవులైన అవధానులందరి యందును ఈ రకమైన ఆత్మ విశ్వాసముతోడి విజృంభణమే ప్రధానలక్షణముగా కనిపించును. కర్నూలు జిల్లా దైవముదిన్నె రామారెడ్డిగారి సంస్థానమున తాము చెప్పుచున్న ఆశువు నందు కొని వ్రాయలేక వ్రాయుదుమన్నవారు తడబడుచుండగా అప్పుడు శ్రీ గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు చెప్పిన పద్యములును వారి శక్తియుక్తులను స్పష్టముగా ప్రకటించుచున్నవి.

**4. గాడేపల్లి వీరరాఘవశాస్త్రి :**

జలదారంభ విజృంభమాణ ఘనవర్ష ప్రోద్భవాసార ధా
రలధిక్కారమొనర్చు మత్కవనధారా ధోరణీ ధాటికిన్
నిలువన్ జాలి లిఖింపబూని కలముంజేపట్టి నాచెప్పిన
ట్టుల వ్రాయంగల ధీరుడైన మొనగాడున్ గల్గెనే యెవ్వడేన్.

ఆగునె వీరరాఘవుని యాశువు ? పార్థశర ప్రయోగమే
యాగిన నాగుగాక ప్రమథాధిపశీర్ష పతన్నదీ జలం
బాగిన నాగుగాక సముదగ్ర తపోధన శాపవాక్కులే
యాగిన నాగుగాక వశమా ? బిసనిల్ప బిసప్రసూతికేన్.
కమ్మలమీద రైలు వడిగాజనునట్లు కవిత్వమందు లో
పమ్మన నెందునేనియు లవ మ్మగుపట్టగనీక యింత శీ

ఘుమ్ముగ వర్ణ్యమున్ నుడువ రాఘవశాస్త్రికె గాక యింక సా
ధ్యమ్మగునే మఱొక్కరికి ? తజ్ఞుల కియ్యది క్రొత్తవింతయే ? [26]

శ్రీ వీరరాఘవశాస్త్రి గారు 1913-27 సంవత్సరముల మధ్యకాలములో ఆంధ్ర ప్రదేశము మొత్తము మీద అరువది నాలుగు అష్టావధానములును ఇరువదియైదు శతావధానములును చేసినట్లు తెలియుచున్నది.[27] మరియు నీయన వ్రాసిన అహోబలమాహాత్మ్యము ఆశుప్రబంధమని చెప్పుదురు. అయిదాశ్వాసముల యాగ్రంథము నెన్నాళ్లలో పూర్తిచేసిరో అది తెలియదు. సమయలేఖినీ విద్య యందును శ్రీ శాస్త్రిగారందెవేసిన చేయిగనుక రామభూపతి శతకము (1914)- దీనకల్పద్రుమ శతకము (1916) - విశ్వేశ్వర శతకము (1917) - సోమేశ్వర శతకము (1919) - చెన్నకేశవ శతకము (?) ఇవన్నియు నొక్కొక్కటి గంట గంటలో చెప్పినారు.

తిరుపతి వేంకట కవులకువలెనే - శ్రీ రాఘవశాస్త్రి గారును కొంత కాలము శ్రీ గోపాలుని సుబ్బరామ కవి అనువానితో కలిసి జంటకవులుగా కవితా ప్రదర్శనము లిచ్చెడివారు. అప్పుడు వారిపేరు వీరరాఘవ సుబ్బరామ కవులు.

1916 లో దొనకొండలో శ్రీ శాస్త్రిగారు శతావధానము చేసిరి. దాని కధ్యక్షత వహించిన శ్రీ మేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రి గారు చివర కిట్లాశువు చెప్పిరి.[28]

తిరుపతి వేంకటేశ్వర సుధీవరులొక్క విధాన కైతక
త్త్వరుతర నూత్నదోహద మహోత్సవముల్ జరిపించి మించి యి
త్తరుణమునందు పెల్లుగ వధానములెల్లెడ జేయుచుండ సం
బరపడి యెంతవారలును ప్రస్తుత కాలమునందు నెల్లెడన్
పురముల పల్లెలందు కడుపూనికతోడ శతావధానమ
త్త్వరుతరశక్తి జేయుదు మహోయన జేయుదుమంచు చాటి య
బ్బురపడ జేయుచుండ - నిట పోలినవాడు స్వదేశమందు నొ
క్కరుడును లేకపోయెనని కుందుచు నుండగ నేడు పండితా

---

26. చమత్కార కవిత్వము. 37. మరియు భారతి మే. 1972.
27. చమత్కార కవిత్వము. 146 - 149.
28. చమత్కార కవిత్వము. 155.

దరమును గాంచువాడు నయతత్పరుడున్ మఱి మాదు శిష్యుడై
పరగినవాడు గాంగఝర పద్ధతి నాశువుజెప్పువాడు ని
ర్భరమతిశాలి గాడెపలి రాఘవు డొక్కడు గానుపించె మే
ల్తరగతిగాగ నీ శతవధానము నేడొనరించి చూపె బా
పురె! కొఱతల్ దొరంగె కడు మోదము గల్గెను కీర్తిదక్కెనున్.

ఈ పద్యములు శ్రీ రాఘవశాస్త్రి గారిని ప్రశంసించుటతో పాటు తిరుపతి కవుల కవితాప్రభావ మా కాలమున ఆంధ్రభాషాభాషీయుల నెట్లు శక్తిమంతులుగా చేసి ముందు కురికించినదో కూడ చెప్పుచున్నవి. అవధానములు చేయకపోయినను అశువునందందరు పండితులును అనాయాసముగానే ప్రవర్తించెడి వారనుటకు ఆ పద్యములు చెప్పిన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారే నిదర్శనము. శ్రీ రాఘవశాస్త్రి గారి శతావధానాశుకవిత తిరుపతి వేంకట కవులమెప్పునకును పాత్రమైనది.[29]

### 5. విశ్వనాథ సత్యనారాయణ :

తిరుపతి వేంకటకవుల శిష్యులలో ఆశుధారా కవిత్వమలవడని వారు లేరనియే చెప్పవచ్చును. విశ్వనాథ సత్యనారాయణ గారును కొడాలి ఆంజనేయులుగారును మొదట మొదట జంటకవులుగా కవితా సాధన చేసినారు. సత్యాంజనేయ కవులు రచించినట్లుగా కొన్ని రచనలును వెలువడినవి. ఆ పిమ్మట ఆ జంట విడిపోక తప్పని పరిస్థితులు వచ్చినవి. జంట కవులుగా నున్నప్పు డాశుకవిత నెంత చెప్పిరో అది తెలియరాకుండానే పోయినది. సత్యనారాయణ గారి ఆశు రచనలలో మిగిలి నిలిచినది 'వేణీ భంగము'. ఇందు దాదాపు ఏబది సీసపద్యములున్నవి. 1928 సంవత్సరమున మొదటిసారిగా ముద్రింపబడినది. ఆ పిమ్మట విశ్వనాథ ఆశురచనమును మానివేసెను. కావ్యరచన-ఆశుకవితా ప్రదర్శనము మానినను అప్పుడప్పుడు సభలలోను, అక్కడక్కడ గోష్ఠులలోను విశ్వనాథ ఆశువుగా పద్యములు చెప్పుటగలదు. కాని వాటిని గురించి ఆయన యేమియు శ్రద్ధ తీసికొనడు గనుక అవి చాలవరకట్లే పోయినవి.

29. చమత్కార కవిత్వము. 157.

# 3. అవధాన కవితలు

## 1. స్వరూప నిరూపణము

అవధానమనగా నదియొక మనోయోగ విశేషము. విషయాంతర సంచారము నిరోధింపబడిన మనస్సునకు అభీష్ట విషయమునందు యోగమే అవధానము. ఈదృశమైన మనోయోగ విశేషము నభ్యసించి ప్రదర్శించెడు వారికి అవధానులని పేరు.

స్వరహీనతను మాత్రాహీనతను సహింపని వేదము నధ్యయనము చేసెడి వారికి అవధానము యొక్క అభ్యాస మనివార్యమైనది. అందుచేత మొదట మొదట వేదవిద్వాంసులే అవధానులు.

మనసున కేకాగ్రతయే కదా అవధానమన్న. అది యేపని సక్రమముగా చేయవలయునన్నను అవసరమే. మనస్సున కేకాగ్రత బాహ్యవిషయముల తాకిడిని బట్టియుండును. మనస్సునకు దేశకాలములు బాహ్యవిషయములు. పూర్వజన్మ సంస్కార రూపమైన ప్రతిభానము లోపలివిషయము. కావ్య బీజము ప్రతిభానము. దేశకాలముల అనుకూల్య రూపమున మనసుకు కలిగెడు అవధానము క్షేత్రము. కావ్య ముత్పన్నమగుట కివి యోగ్యముగా నుండవలయును. వామనాచార్యుడు చిత్తైకాగ్ర్యము నవధానముగా చెప్పిన దానికర్థమది.[1] ఇక్కడ ఇదొక వాఙ్మయ విలాసప్రక్రియ కాదు. ఒక మంచి మనోలక్షణము. క్రమముగా అవధానముతో చేసెడి ప్రదర్శనము లన్నింటి కిని అవధానములనియే పేరు వచ్చినది. ఆశుకవిత్వమునందు సమస్యా పూరణ మును, వ్యస్తాక్షరిని, నిషేధాక్షరిని విడివిడిగా చెప్పుటకు హేతువులు అవి దేని కదిగా నవధానముతో చేయవలసినపనులగుటయే. మునుముందా విధముగా నవి దేనికదిగా నొకఅవధానమై అట్టి యెనిమిదింటియొక్క ఏకకాల నిర్వహణమునకు అష్టావధానమని, నూరింటియొక్క ఏకకాల నిర్వహణమునకు శతావధాన మనియు పేర్లు వచ్చినవి. నిజముచెప్పవలసివచ్చినచో అష్టావధాన శతావధానములు అవధానములుకావు- అవధానవిశేషములు అని చెప్పవలయును.

---

1. విజ్ఞాన సర్వస్వము. ఆరవసంపుటము. 522.

నేత్రావధానమని[2] నాట్యావధానమని కూడ కలవు. నేత్రావధానము స్వరూపము తెలియదు. నాట్యావధానమునకు వాఙ్మయముతో సంబంధమున్నది కాని కావ్యసామగ్రితో సంబంధములేదు.

ఆశుధారాకవిత్వముల వారే మొదటినుండియు నవధానములు చేయుచుండుటచేత అవధానమనగా పద్యవిద్యాప్రదర్శన రూపమైన అష్టావధానమో, శతావధానమో అన్నట్లు రూఢమైనది.[3]

అవధానములు చూచెడు వారికి వినోదప్రాయములుగానే యుండును కాని చేసెడు వారికి ప్రాణము మీదకు వచ్చినంత పనిగానుండును. అది తమ కొక విలాస క్రీడయన్నట్లుగా నవధానులు కొందరు ప్రవర్తించుట అది వారి ప్రతిభా విశేషమునకు మాత్రమే నిదర్శనము. అవధానులకు ఉభయభాషా పాండితి, శాస్త్రప్రవేశము, ప్రతిభ, అనర్గళాసుధార, సమయస్ఫూర్తి, అసాధారణ ధారణ ఉన్నప్పుడే వారి అవధానములు సభారంజకములై రాణించును.[4]

సహస్రావధానమని కూడ ఇటీవలికాలమున వినుపించుచున్నది. వినిపించిన దని చెప్పుటలోనే సామంజస్యమున్నది.

## 2. ప్రారంభదశా కాలము

అష్టావధానము, శతావధానము, అన్న పేర్లు మొదట మొదట వినుపింపక పోయినను శ్రీనాథుని కాలమునుండి ఈదృశమైన కవితా ప్రదర్శనములు మొదలయినట్లు కనుపించుచున్నది. ఆశుకవిత్వమునకు వలెనే అవధానకవిత్వమును శ్రీనాథ యుగముననే ప్రసిద్ధికి వచ్చినది. శ్రీనాథుడవధాన శబ్దము నుపయోగించినను[5] అది దాని స్వార్థమునందే యున్నది కాని వాఙ్మయ విలాసక్రీడయైన

2. కొప్పరపు సోదరకవుల చరిత్ర. 41.
3. గుంటూరు కాలేజీ శతావధానము. అవధానములు. xxxv.
4. విజ్ఞానసర్వస్వము. ఆరవ సంపుటము. 522. మరియు తిరుపతి కవుల సాహిత్యసమీక్ష. 30.
5. కాశీఖండము. 2-68.

అవధానమును చెప్పుటలేదు. ఆ లెక్కను పాల్కురికి సోమనాథుడు కూడ ఆ శబ్దము నుపయోగించినాడు.[6] అక్కడను అది స్వార్థమునే చెప్పుచున్నది.

జక్కన కవి తన తాతగారయిన పెద్దయామాత్య సుకవి మహిమ నొక సీసమాలిక యందు వర్ణించుచు "ఎవ్వడే యవధానమెఱుగు నయ్యవధానమున వానికించుకముల్లుసూప" గలడని విస్పష్టముగా వ్రాసినాడు.[7] ఈ పెద్దయామాత్యుడు పది సంవత్సరములటునిటుగా తిక్కన సోమయాజి కాలము వాడయినచో అవధానవిద్య అప్పటి నుండియే యున్నదని చెప్పవలసివచ్చును. చెప్పినను ఏమని చెప్పవలయును ? అష్టావధానమనియా ? శతావధానమనియా ? రెండునూ కావచ్చును. మరియింకను అవధాన విశేషములున్నచో అవియును కావచ్చును.

ఆంధ్రభాష యందు అవధాన కవిత్వమును ఆయన తాతగారేగాక జక్కనయు చేసెడివాడని కొందఱి అభిప్రాయము.[8] తన తాత అవధానకవిత్వ నిపుణుడని చెప్పెనే కాని స్వవిషయమున అట్లెక్కడను జక్కన చెప్పలేదు.[9]

ఆ తరువాత కాలమున చరికొండ ధర్మన్న రామరాజ భూషణుడు మొదలయిన వారు తాము శతలేఖినీ పద్యసంధాన ధౌరేయులమని చెప్పుకొనిరి. కనుక వారు చెప్పినది శతావధానము విషయమే కావచ్చును. అగుచో తెలుగు భాషా కవులకు మొట్టమొదట శతావధాన విద్యయే వశమైనదనవలయును.

రామరాజ భూషణుడే భట్టుమూర్తియును గనుక ఆయనను అవధాన శారదామూర్తి[10] యని చెప్పవలయును. మరియు నాయన తనను గురించి చెప్పుకొన్న విషయములును గమనింప దగినవి.

శత లేఖినీ పద్య సంధాన ధౌరేయు
ఘటికా శతగ్రంథకరణ ధుర్యు
ఆశు ప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్య ని
రోష్ఠ్యజ్ఞు నచల జిహ్వోక్తి నిపుణు

---

6. బసవ పురాణము. 1. పంక్తి. 143.
7. విక్రమార్క చరిత్ర. 1-20.
8. గుంటూరు కాలేజీ శతావధానము. అవధానములు. xxxiv.
9. విక్రమార్క చరిత్రము. (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ) పీఠిక 3.
10. కావ్యాలంకార సంగ్రహము. గద్య.

తత్సమ భాషా వితానజ్ఞు బహు పద్య
సాధిత వ్యస్తాక్షరీ ధురీణు
నేక సంధోదిత శ్లోక భాషాకృత్య
చతురు నోష్ఠ్య నిరోష్ఠ్య సంకరజ్ఞు
నమితయమకాశునిధి ప్రబంధాంక సింగ
రాజసుత తిమ్మరాజ పుత్ర ప్రసిద్ధ
సరస వేంకటరాయ భూషణ సుపుత్రు
నను బుధ విధేయు శుభ మూర్తి నాయధేయు[11]

ఆశు ప్రబంధ బంధాజిజ్ఞుడనని, అమిత యమ కాశునిధినని తన యాశుధారా రచనమునందలి పారగత్వమును ఒకటికి రెండుసార్లు చెప్పుచున్నాడు. శతలేఖినీ సమయలేఖినీ విద్యాప్రదర్శనముల కది మొదటి యవసరము గనుక కవియందట్లే యుండవలయును. బహుపద్యసాధిత వ్యస్తాక్షరీ ధురీణుడనను చున్నాడు- అనగా ఆ కాలమున నది వ్యస్తముగా నొక కవితా విలాస ప్రక్రియగా నున్నదని యర్థము. అంతేగాని అష్టావధానము నందొక యంగమును మాత్రమే భట్టుమూర్తి చేసినాడు గాని, సంపూర్ణముగా నష్టావధానమును చేసి యుండడని[12] చెప్ప కూడదు. అష్టావధాన ప్రక్రియ అప్పుడున్నదో లేదో కూడా మనకు గట్టిగా తెలియదు. శతలేఖిన్యవధానము చెప్పబడినట్లుగా అష్టావధానము చెప్పబడలేదు. స్వీయములయిన ప్రతిభా పాండిత్యముల నంత విశదముగా పేరు పేరున పేర్కొన్న వారు అష్టావధానమన్న ఒక ప్రక్రియా విశేషమును తాము ప్రదర్శించి యున్నచో, మన లెక్క ప్రకారమందలి యొక యంశమునే పెద్దగా చెప్పుకొన్నప్పుడు, దానిని పేర్కొనక విడిచి పుచ్చరు కదా! అందువల్ల అప్పుడు తెలిసినది శతావధానమే. ఆశుకవితయే శతావధానమునకు ప్రాణము గనుక ఆశుకవితను సాధించిన ఆంధ్రకవులట్లు చెప్పుకొనియుందురు. అయినను లాక్షణికుడాశుకవిత్వమునందు శతావధానమును గాక అష్టావధానము నెందుకు చెప్పినాడో ఇంకను విచారింపవలసి యున్నది.

---

11. కావ్యాలంకార సంగ్రహము. 1-13.
12. తిరుపతి కవుల సాహిత్య సమీక్ష. 25.

మరియు పదునైదవ శతాబ్దముత్తరార్ధమునందున్న హరిభట్టు తాను "అష్ట ఘంటావధాన పరమేశ్వరు" డనని గద్యలో వ్రాసికొనినాడు.[13] పదునారవశతాబ్ద ముత్తరార్థము నందలి కంకంటి పాపరాజు కూడా "చతుర్విధానపద్య కవిత్వ విద్యావధానాధునాతనభోజరాజు"నని వ్రాసికొన్నాడు.[14]అష్టఘంటావధానమనగా నేమి? ఇంకను విచారింపవలయును. పాపరాజుగారి అవధానము స్వరూప మును తెలియవలెను. విశేషణములు విలక్షణములుగా నున్నవి కదా!

పదునేడవశతాబ్ద ముత్తరార్ధమునధిగమించి తంజావూరును పాలించిన శహాజీ మహారాజు ఆస్థానమునందున్న ఆంధ్ర భాషా కవులలో పేరు తెలియని "అష్టావధాని కవి" ఒకాయన కలడు.[15] ఆయన బిరుదు నామమునుబట్టి ఆయన అష్టావధానములు చేసెడివాడని నిస్సందేహముగా చెప్పవచ్చును. అప్పటి అష్టావధాన ప్రక్రియావిధాన మెట్లుండెడిదో ప్రత్యక్షముగా మనకు తెలియదు.

ఈ విధముగా అవధానవిద్య శ్రీనాథుని కాలమునుండియు తానున్నానని పించుచు రాయల యుగానంతరము- శతావధానముగా - శతలేఖ్యనవధానముగా ప్రసిద్ధమై దక్షిణాంధ్ర దేశమున అష్టావధాన రూపమును కూడ పొంది ఈ ఇరు వదియవ శతాబ్దారంబమునకే శ్రీ తిరుపతి వేంకట కవుల నాశ్రయించి ఆపై శిష్య ముఖముగా కొంతకాలముపాటు ఆంధ్రభాషా సరస్వతిని చకచ్చకితము చేసినది. **ఆశుకవిత - అవధానకవిత - తిరుపతి వేంకట కవులు - శతావధానములు - ఇవి తుల్యార్థకములు.**

చరిగొండ ధర్మన్న సత్కవి చంద్రుండు
నవకంపు మొక్కను నాటినాడు
భట్టుమూర్తియనెడు పండిత మాన్యుండు
పొలుపొందగా నీరు పోసినాడు
అట మాడభూషి వేంకట సత్కవీంద్రుండు
పెంపొందగా సల్లు పెట్టినాడు
తిరుపతి వేంకటేశ్వరు లనశ్వరముగా
సదమల కృపతోడ సాకినారు

---

13. నారసింహ పురాణము ఉత్తరభాగము.
14. శ్రీముదుత్తర రామాయణము.
15. దక్షిణ దేశీయాంధ్రవాఙ్మయము. 234.

అట్టిదగు నీ శతావధాన మనెడి లతిక
సరసఁ గొప్పరపుం గవీశ్వరుల చేత
పుషితమై విరుల దగె తత్ఫుల్ల సుమము
లఖిల వేదులు దాల్చెద రౌదలలను. 16

ఈ పద్యమును చెప్పి శ్రీ శేషాద్రి రమణ కవులు శతావధానము యొక్క పుట్టు పూర్వోత్తములను సమీక్షించిరి. మొదటి ముగ్గురును తిరుపతి వేంకటేశ్వరుల శతావధానాశుకవితా సౌధమునకు పునాది క్రింద పడిపోయినారు. తిరుపతి వేంకట కవుల కాలము - అనగా - ఇరువదియవ శతాబ్దము ప్రథమ పాదము - ఆంధ్ర దేశ భాషలను ఆశుకవితా ప్రవాహమున ముంచి తేల్చినది. అవధానాత్మకము లయిన వాఙ్మయ విలాసములు వెల్లివిరిసినవి.

## 3. అవధాన విద్యా ప్రభువులు

అత్యద్భుత ప్రాభావాష్టావధాన శ
తావధానములు స్వాభావికములు.

నూఱు మందికి కవనంబపార ధార
వఱల జెప్పెడి మాకిది బహుమతియని. 17

శతలేఖినీ పద్య సందర్భ నిర్భరుల్
తిరుపతి వేంకటేశ్వరుల కెఱఁగి. 18

ఇలపయి నాంధ్రదేశమున నిర్వురు తిర్పతి వేంకటాఖ్యులై
కలరుకదా యశోధను లఖండుల మోఘ కవిత్వ చాతురీ
కవిత శతావధానులని కంకణముల్ ధరియించినట్టివారు. 19

16. కొప్పరపు సోదర కవుల చరిత్ర. 61.
17. నానారాజ సందర్శనము. 15, 125.
18. వేలూరి శివరామశాస్త్రి.
19. వేమూరి వేంకటసుబ్బయ్య.

శతలేఖిన్యవధానముల్ సలుపుచున్ సత్కీర్తి నార్జించి యు
న్నతులే శ్రీపతి వేంకటేశకవులే ధన్యాత్ము లూహింపగన్. 20

తిరుపతి వేంకటేశ కవిధీర కృషీవలులాంధ్ర సంస్కృతో
ర్వరగాని బుద్ధియుగ్యముల బాగుగదున్ని శతావధాన దు
స్తరకవితాది బీజముల చల్లగమెల్చె సుబోధనాసుధా
ఝరుల పెరుంగుచున్..................21

తిరుపతి వేంకట కవులవతరించినప్పటి నుండి దేశభాషలను గ్రుచ్చి యెత్తెడు వాఙ్మయ విలాస ప్రక్రియగా శతావధానమునకు పెద్ద ప్రచారము వచ్చినది. అంత ప్రచారము వచ్చుటకానాటి విద్వత్కవుల యందున్న ఈర్ష్యా సూయలతోడి జిగీషా మనీషయు ప్రబల హేతువు. ఈ కావ్య విద్యా వీరాహంకారమునకు గురుస్థానీయులైన ఆంధ్రభాషా మహాకవులు వేములవాడ భీమకవి, శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు. భీమకవి సంగతికంటె తరువాతి వారిని గురించిన సమాచారము మనకెక్కువగా తెలియును.

దీనార టంకాల తీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకు తోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధ గ్రంథ సందర్భమునకు
పగుల గొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూష క్రియాశక్తి రాయలయొద్ద
పాదుకొల్పితి సార్వభౌమ బిరుదు
ఎటులు మెప్పించెదో నన్ను నింకమీద
రావు సింగ మహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
సరస సద్గుణ నికురంబ! శారదాంబ! 22

---

20. మైలవరపు కృష్ణమూర్తిశాస్త్రి.
21. గుంటుపల్లి సుబ్రహ్మణ్యం. గుంటూరు కాలేజీ శతావధానము చూచునది.
22. చాటుపద్య మణిమంజరి. ప్రథమ భాగము. 115.

ఒకని కవిత్వ మందెనయు నొప్పులు తప్పులు. నాకవిత్వ మం
దొకనికి తప్పు పట్టుపని యుండదు కాదని తప్పుపట్టినన్
మొకమటు క్రిందుగా దివిచి మొక్కలు వోవ నినుపకత్తితో
సికమొదలంట గోయుదును చెప్పునగొట్టుదు మోముదన్నుదున్.23

ఆవిధముగా శ్రీనాథుడు ఈవిధముగా తెనాలి రామకృష్ణుడు తిరుపతి వేంకట కవుల నావేశించి తెలుగు దేశమును తెలుగు కవితను ఆకాలమున గ్రుచ్చియెత్తింపించిరి. తదావేశమది యెట్లో ఈ క్రింది పద్యముల వలన కొంత యూహింపవచ్చును.

ఆనంద గజపతిక్ష్మానాథు సభలోన
కవనమ్ముచే మెప్పు గాంచినాము
రావు జగ్గారాయ రాజన్యు సభలోన
శతఘంటకవనమ్ము సలిపినాము
కాకినాడాది సద్గ్రామమ్ముల శతావ
ధానమ్ముచే కీర్తి బూనినాము
కాశీసహస్రాది కావ్యమ్ములు రచించి
కాశీకృపం జెంద జాలినాము
ధాతురత్నాకరోద్దామి చంపువు వ్రాసి
పాణినీయస్తుతుల్ వడసినాము.
నిరుడు గద్వాల రాజసన్నిధిని శత్రు
మధ్యమందు జయంబంది మహిమవలన
బంగరు బిరుదులును జయపత్రికయును
బడసి యీయేడు నిను జూడవచ్చినార
మాత్మకూరుపురీరాజ! అతులతేజ! 24

---

23. చాటు పద్యమణి మంజరి. ప్రథమభాగము 145.
24. నానారాజ సందర్శనము. పూర్వార్థము. 53.

అభినవ రామలింగ బిరుదాంకుడ నా కవనమ్మునందు నీ
యభణపుగాండ్లు తప్పులిడ నర్హులె? కాదని తప్పుదిద్ద మా
యుభయులలోన నొక్కడు మరొక్కనికిం దగుగాక ఈర్ష్యచే
శుభము శుభమ్మునుం దెలియ కార్చెడి దేబెలు మాకు లెక్కయే![25]

దేశసంచారమునకు మూలమైన విద్వద్ద్వేషము గూర్చి తిరుపతి వేంకటకవు లాత్మ సంబోధనముగా చెప్పుకొన్న పద్యము.

ఎట్టో విద్యలనభ్యసించు కొని యా యీ దూరదేశమ్ములం
బట్టంబంచును పల్లెయంచనక విద్వద్ద్వేషముంబూని బల్
తిట్టుల్ తిట్టుచు తిట్టులంబడుచు నిన్ ద్రిప్పన్ ఫలంబేమి యో
పొట్టా! నీదురదృష్ట మిట్లయినచో భూపాలకుల్ నింద్యులే?[26]

ప్రభువులుగా ప్రవర్తించి అవధాన విద్యావైభవమునకు మారుపేరుగా నిలువద్రొక్కికొనినారు గనుక తిరుపతికవుల నింతగా అనుకొను చున్నాము గాని ఇంతకంటె ముందుగా ననుకొనవలసినది శ్రీమదభినవ పండితరాయ విద్వన్మాడభూషి వేంకటాచార్యులవారిని. అసలీ అవధాన సామ్రాజ్యము వారిది.[27] వారినుండియే తమకిది సంక్రమించినదని తిరుపతికవులు సగర్వముగా చెప్పుకొనినారుకూడ.[28] విజయలక్ష్మి వీరికి మిక్కిలి చేదోడు వాదోడుగానై దోహదము చేయుటచేత సామ్రాజ్యము మహాసామ్రాజ్యమై తిరుపతి కవులు దానికి తాము ప్రభువులయినారు.

ఆ ప్రభుత్వకాలములో జంటకవులుగా నుండి అవధానాశువులను నిర్వహించుట "ఒక ఫాషనై పోయినది." ఇంతేగాక ఈ కాలములో శతావధానాలు చేయుట "ఒకజాడ్యముగా పాకిపోయినది."[29] మరియు వీరు ఆంధ్ర దేశము అన్నిమూలలను శిష్యగణము ద్వారా స్థావరమేర్పరచుకొన్నారు. పేరు పడిన ఆధునికాంధ్రకవులు వారి శిష్యులు కానివారు లేరనవచ్చునేమో కూడా!

---

25. నానారాజ సందర్శనము. ఉత్తరార్ధము. 121.
26. నానారాజ సందర్శనము. పూర్వార్ధము. 53.
27. శ్రీ మాడభూషి వేంకటాచార్యులు. వ్యాసము. భారతి. సెప్టెంబరు. 1964
28. తిరుపతి కవుల సాహిత్య సమీక్ష. 25.
29. నవ్యాంధ్ర సాహిత్యవీథులు. ప్రథమభాగము. 35.

# 4. అష్టావధానము

ఆశు కవిత్వములో నిదియు నొకవిధమే అయినప్పటికిని తనలోనే ఆశు కవిత్వము నొక విధమునునట్లుగా ఈ అష్టావధానము ప్రశస్తికి వచ్చినది. అసలు విచిత్రమేమనగా ఆశుకవనమీ అవధానములోని యెనిమిది క్రియలలో నొకటికాదు. అది వట్టి యుపరి. తిరుపతి వేంకట కవుల యష్టావధానములందును ఆశు కవిత్వ ముపోద్ఘాత ప్రాయముగాను మరియు తుదకుపసంహార రూపముననను నుండెడిది.

అరయగ మేమొనర్పగల మష్టవధానము దానిరీతి నే
ర్పఱచి వచింతు; మెట్లనిన-పండిత సమ్మతిగా కవిత్వ మెం
దఱడిగిరేని యందరకు తప్పులు చొప్పడకుండ నాంధ్ర మం
దు రహిని దేవభాషను సుదుష్కర కల్పనలొప్పఁజెప్పి-యెం
దఱయినగాని కష్టపు విధమ్మన నెన్నిటినైనగాని య
క్కరములొసంగిరేని యవిగైకొని తప్పక చెప్పి-యంతటో
కరయము మీఱ లౌకిక ప్రకారముగా వచియించువారి కు
త్తరము లొసంగి- మీదను ముదంబలరన్ జదరంగమాడి-కొం
దఱకు గురుత్వమూని పఠనమ్ములఁజెప్పి-పురాణగాథలన్
దురమొనరన్ ఖరింపగ నెదురొ్కని యర్థముచెప్పి-పుష్పముల్
గరమును వీపుపై విడువగా సరిగా గణియించి-ఘంటికల్
నెఱయగఁగొట్టువానిని గణించి-నిషేధమొనర్చునట్టి య
క్కరములుమాని పద్యములు కల్పనచేసి-మనోహరమ్ముగా
విరచన సేయనేర్తుమిది వేడుకమీఱగ చిత్తగింపుడీ! 30

(వ్యస్తాక్షరి) దత్తపది - లోకాభి రామాయణము - చదరంగము - కావ్యపాఠము- (అకాశ) పురాణము - పుష్పగణనము - ఘంటా గణనము - నిషేధాక్షరి - ఇవి అష్టావధానమునందలి క్రియా విశేషములు, సంస్కృతాంధ్రములయం దడిగిన వారికడిగినట్లు ఆశుకవిత్వము చెప్పుట యది యదనము.

---

30. నానారాజ సందర్శనము. పూర్వార్థము. 48.

అష్టావధాన స్వరూపమును నిష్కర్షించెడి పద్యము వారిదే మరొకటి కలదు.

పౌరాణోక్తి కవిత్వ పుష్ప గణనా వ్యస్తాక్షరుల్ లౌక్య గం
భీరోక్త్యంచిత కావ్యపాఠన కళా విద్భాషణంబుల్ ముదం
బారంగా చతురంగ ఖేలనము, ఈ యిష్టప్రకారంబు లో
ప్పారున్ శంకర ! యేక కాలముననే యష్టావధానమ్మనన్. 31

ఇందుదత్తపదిలేదు. ఘంటా గణనములేదు. నిషేధాక్షరి లేదు. ఇందుకు బదులుగా కవిత్వమాశువుగా చెప్పుట - శాస్త్రవాదము చేయుట - వ్యస్తాక్షరములను కలిపి చెప్పుట - ఉన్నవి.

తిరుపతి వేంకటకవులు తాము చేసెడు అష్టావధానముల స్వరూపమును గద్వాల సంస్థానమున విశదీకరించి చేసిరిగదా ! అష్టావధానములోని యెనిమిది విషయములును అవి యేవి అన్నప్పుడు అభిప్రాయ వైవిధ్యమున్నది.[32] ఆశుకవిత - వ్యస్తాక్షరి - అప్రస్తుత ప్రశంస - చదరంగము - కావ్యపాఠము - పురాణము పుష్పగణనము - ఘంటా గణనము - నిషేధాక్షరి — దత్తపది - సమస్యాపూరణము - ఈయబడిన ఇంగ్లీషు తేదీకి సరియైన వారమును చెప్పుట - యాంత్రిక చిత్రము లేక గణిత చాతుర్యమును ప్రదర్శించుట - ఈ మొదలయిన బహ్వాంశములలో అవధాని తన శక్తికనువైన యెనిమిదింటి నెన్నుకొనును. ఆశుకవిత- వ్యస్తాక్షరి - నిషిద్ధాక్షరి - దత్తపది - సమస్యా పూరణము - ఈ అయిదే కవి యొక్క పద్యరచనా ప్రతిభకు సంబంధించినవి; మిగిలినవికవిత్వాంశములు కావు. అవి సగము ఇవి సగముగా అష్టావధానములు జరుగుచుండును. సామాన్యులయిన సామాజికులకు ఆశుకవిత రుచించినట్లుగా వ్యస్తాక్షరి - నిషిద్ధాక్షరి - దత్తపది ఇత్యాదులు రుచింపవు. అవి వారి బుద్ధికి విషయములు కావు. కవిత్వాంశములు కానివన్నియును వారికొరకు.

అవధానమును సమస్యతో మొదలుపెట్టినచో చమత్కారముగా నుండును. సాధారణముగా సమస్య ఒకానొక పద్యము యొక్క పాదముగా నుండును. అది విపరీతార్థ ప్రాతిపదికముగా గూడ నుండును. అవధాని తన ధీశక్తిచేత

31. శతావధాన సారము. ఉపోద్ఘాతము. ix.
32. గుంటూరు కాలేజీ శతావధానము. అవధానములు. xxx.

తదర్థ వైపరిత్యమును తొలగించుచు సార్థకముగా పద్యమును పూరింపవలెను. అవధానములో సమస్యనిచ్చుటయే మొదటి ప్రశ్న.

1. సమస్య : గరుడుడు గణపతికిఁ దండ్రి గావలెజుమ్మీ. గరుత్మంతునకు గణపతికిని తండ్రి కొడుకుల సంబంధమును చెప్పుట విపరీతముగా నున్నదికదా ! ఇంత విరుద్ధార్థమును సార్థకముగా చేసిచేయుటయే సమస్యను పూరించుట. మొదటి ప్రశ్నమును విని అవధాని రెండవ పృచ్ఛకునినుండి రెండవప్రశ్నమును వినగోరును.

2. నిషిద్ధాక్షరి : ఫలానా విషయమును ఫలానా పద్యమున వర్ణింపుమని పృచ్ఛకుడు కోరును. ఆ విషయమును మనస్సున పెట్టుకొని అవధాని తరువాతి ప్రశ్న కొరకు మూడవవాని నడుగును.

3. వ్యస్తాక్షరి : ఒక పద్యములోని అక్షరములను చిన్న చిన్న కాగితపు ముక్కలమీద ఒక్కొక్కటిగా వ్రాసి అది యెన్నవ యక్షరమో ఆ సంఖ్యను కూడ దాని క్రింద వ్రాసి మొత్తము కలగా పులగము చేసి పెట్టుకొన్న పృచ్ఛకుడు తనకు చేతికి వచ్చిన కాగితపు ముక్క నొక దానిని అవధాని కందించును. ఆ అక్షరమును దాని సంఖ్యను చూచుకొని అవధాని ఆ కాగితపు ముక్కను తిరిగి పృచ్ఛకున కిచ్చివేయును. ఆ పిమ్మట నాల్గవ ప్రశ్నకొరకు తరువాతివానిని పలుకరించును.

4. దత్తపది : ఏవో నాలుగైదు పదముల నెన్నిక చేసికొని వచ్చిన పృచ్ఛకుడు వాని నవధానికి చెప్పి ఆ పదములు వచ్చునట్లుగా ఫలానా విషయమును గురించి పద్యమును చెప్పగోరును. ఫలానా పద్యమును చెప్పుమని కూడ అడుగవచ్చును.

దత్త పదిప్రశ్న : గోలకొండ, పూలదండ, కొత్తకుండ, మాలముండ - ఈ పదముల నుపయోగించుచు రామాయణ కథా విషయముగా పద్యమును చెప్పవలెను.

ఈ నాలుగు ప్రశ్నముల నడుగు లోపలనే మధ్య మధ్య అప్రస్తుత ప్రసంగము - ఆశుకవిత - తేదీకి వారము - పుష్ప గణనము ఇత్యాదు లేవో ఆ మిగిలిన నాలుగు క్రియలును కొనసాగుచుండును. ఇందులో కూడ ఆశుకవిత తేదీకి వారము సాధారణముగా ఒకసారితో సమాప్తమై పోవును. అప్రస్తుత

ప్రసంగమొకటి కొనదాక మధ్య మధ్య అవధానిని అన్య విషయముల వైపు త్రిప్పుటకు ప్రయత్నించుచుండును. అష్టావధానమున కవి దృష్టి అంతయును ఆ నాలుగు ప్రశ్నల మీదనే యుండును. వరుసగా ఆ ప్రశ్నములకు సమాధాన పద్యములను ప్రారంభించిన అవధాని ముందన్నింటికిని మొదటి పాదములను చెప్పును. మధ్య మధ్య పృచ్ఛకుల లోకాభిరామాయణములో పాల్గొని చమత్కారమును కల్పించుచు - పురాణాదికములను చెప్పుచు క్రమము దప్పకుండ ద్వితీయాది పాదములను కూడ చెప్పి పద్యములను పూర్తి చేసి చివర కన్ని పద్యములను యథాపూర్వకముగా నప్పజెప్పవలయును. అప్పటికి గాని అవధానము పూర్తి కాదు.

1. హరుఁడు గణపతికిఁబోలెన్
సరసీజాక్షుండు నాభిజన్మనకుబలెన్
గురుకీర్తి గన్న యా సా
గరుఁడుడుగణపతికిఁ దండ్రి గావలె జుమ్మీ.[33]

ఇది సమస్యాపూరణము. గరుడుడుగణపతికిఅన్నదానికి ముందు "సా" అను వర్ణమును కలిపి సాగరుడు + ఉడుగణపతి అని విడదీయుటచేత నక్షత్ర గణమున కధిపతి యైనవాడు చంద్రుడనియు వానికి సాగరుడు తండ్రి యనియు అర్థము పొసగిపోయినది. సమస్యాపూరణ మనగా అర్థవైపరీత్యములను తొలగబెట్టుచు ఆశ్చర్యకరమైన మలుపును తెచ్చి సార్థకముగా పద్యమును కల్పింపవలెను.

2. నిషిద్ధాక్షరి పద్యమును అవధాని ఒక అక్షరముతో మొదలు పెట్టును. దాని తరువాత ఏ అక్షరము వచ్చుటకు వీలున్నదో గ్రహించి దానిని పృచ్ఛకుడు నిషేధించును. అప్పుడు అవధాని తాను మొదట చెప్పిన వర్ణముతో కలసి అర్థము చెప్పగలిగిన మరొక వర్ణమును చెప్పును. ఆ రెండు వర్ణముల తరువాత వచ్చుటకు వీలున్నదని తాను గ్రహించిన అక్షరమును మరల పృచ్ఛకుడు నిషేధించును. ఈ విధముగా పద్యము నంతటిని ఒక్కొక్క అక్షరముగా పృచ్ఛకుడు నిషేధించిన అక్షరములను విడిచి పుచ్చుచు నెమ్మదిగా నెట్టుకొని పోవలయును.

---

33. కొప్పరపు సోదర కవుల చరిత్ర. పుట. 26.

3. వ్యస్తాక్షరి పద్యాక్షరములను సంఖ్యాక్రమముననుసరించి జ్ఞాపకము పెట్టుకొని అవన్నియు నా వరుసలో ఏ పద్యమున కిముడునో చూచుకొని ఆ వరుసను పద్యమును అప్పగింపవలెను.

4. దత్త పదములుంచి కోరిన విషయముతో పద్యము చెప్పుట :

నీ నాథుండన గోలకొండ పయి నెంతేనుండు నవ్వారితో
నీనాఁడంబుధి దాటివచ్చు టెఱుఁగఁ డేమందునా రాఘవో
ర్వీ నుండి ప్డెద పూలదండ పయి పై రేకొత్తకుండంగ గె
ట్టానన్ రా మనమూలనుండదనుటెట్లో తెల్పు మండోదరీ.[34]

గోలకొండను రెండు పదములుగా విడదీసినారు. గోలయనగా మూర్ఖుడని యర్థము. కొండపయినున్న వారు కిష్కింధాపురము వారు. ఎద పూలదండ - ఎదయందలి పూల దండ పై పై రేకు కూడ ఒత్తకుండ నలగకుండగా నని యర్థము. రేకు + ఒత్తకుండ రేకొత్తకుండ మనము + ఆలము + ఉండదనుట - మనము యుద్ధమందుండదనుకొనుట యెట్లని యర్థము. ఇచ్చిన పదము లిచ్చినట్లే యున్నట్లు కనిపింపజేయుచు వాటి సంధులూడదగొట్టి అవధానులు పద్యమును చెప్పినారు.

తిరుపతి వేంకట కవులు నిర్వహించెడు అష్టావధానముల విధానము తెలియుట కానాటిదే యైన ఒక వర్ణనాత్మకమైన పత్రికా ప్రకటన మిక్కడ యథాతథముగా చూపబడుచున్నది.[35]

౧. తొమ్మిది మందికి నాయ వారు కోరుకొనిన వర్ణనలు వారు వారు కోరుకొనిన శ్లోక పద్యములలో వారు ఏర్పరచిన నియమములతోడను తెలుగున సంస్కృతంబున వారు నిషేధించిన యక్షరములు రాకుండ నవలీలగ నొక్కొక్క యక్షరము చెప్పుమనిన వారికి నొక్కొక్క యక్షరము పంక్తులను మారుచేసి యక్షరములు గోరినవారికి నట్లేయును నొక్కొక్క పాదము చెప్పుమని గోరిన వారికి నట్లేయును మొదటి చరణము చెప్పుచుండగ నంతట నిలిపి రెండవ మూడవ చరణములతో నొక్కొక్క పదము నడిగిన నట్లే చెప్పుచును నందులో నడిగిన వారి

34. కొప్పరపు సోదర కవుల చరిత్ర. 61.
35. శతావధానసారము. అనుబంధము. 155.

చ్చిన నేదియో మూడక్షరముల పదమును గూడ గల్పి చెప్పుడనిన నట్లే యును నొనర్చుచు కవిత్వము చెప్పబడినది.

౨. సభికులలో నొకరు ఏదియో ఒక జర్మనీ దేశ చారిత్రకములోని యొక్క యితిహాసమును జదివి వినిపించిన నద్దానిని మనమందిడికొని తిరుపతి శాస్త్రిల వారు సంస్కృతమున శ్లోకరూపముగ నొక్క పురాణముగా విరచించి రాగయుక్తముగ వినిపింపుచుండ వేంకటేశ్వర శాస్త్రిల వారిచే నత్రిశావ్యమ్ముగ దానికంతయు రాగయుక్తంబుగనే యర్థమ్ము వక్కాణింపుచు నాకాశ పురాణము చెప్పబడెను.

౩. తెలుగు, అరవము, ఇంగ్లీషు మొదలగు నానా భాషలలోని పదములు ఇరువది క్రమము తప్పించి, యొక్కొక్క పదమును దానికి వరుసలో నివ్వబడిన సంఖ్య సహితముగ నొక్క కాగితపు ముక్క మీద వ్రాసి మధ్య మధ్య నిచ్చుచుండ నవి యన్నియు వరుసగా మనస్సున నమర్చి కొని యవధానాంతమునందు తప్పకుండ ప్రతి పదమును వినిపించుట యనెడు వ్యస్తాక్షరియును చేయబడెను.

౪. అనేక మారులుగ వేలువేలు సంఖ్యలుగ కనుచాటుగ కొట్టబడిన గంటల మొత్తము తప్పకుండ నెనుబది యొక్కటి యని చెప్పబడియె.

౫. వ్యాకరణ శాస్త్రములో నొక పండితునితో శాస్త్ర సమ్మతముగ పండిత జనానుమోదమ్ముగ ప్రసంగంబు చేయబడెను.

౬. రఘువంశమ్ములో నొక విద్యార్థికి నొక్క శ్లోకము క్రమముగా పాఠము చెప్పబడినది.

౭. లోక విషయములు చమత్కారముగ సయుక్తికముగ మధ్య మధ్య సభానురంజకముగ నడిగిన వారితోడ నెల్ల ముచ్చటింపబడినవి.

౮. చతురంగములో బాగుగ నాడగలము అని పేరు వడసిన యొక యిద్దరు గొప్పవారొక ప్రక్కనుండి యాడగ వారితో నాడి గొప్ప గొప్ప మొహరాలను గూడ నోడించి యెత్తుల నడిగిన నిచ్చుచు నాడబడినది.

ఈ యవధానములన్నియు నే లోపము లేక సమాప్తి నొందిన పిదప సభనాదరించి వచ్చిన విద్వజ్జనులు (కొందరు) సంస్కృతాంధ్రములలో తమ తమ సంతోషముల దెలుపు నుపన్యాసములిచ్చిరి.[36]

---

36. ఈ పత్రికా ప్రకటనమును వ్రాసినది శ్రీ కుప్పచ్చి లక్ష్మయ్య. పెన్షండ్ ఓవర్ సీయరు.

తిరుపతి వేంకట కవుల యష్టావధానమునకు పృచ్ఛకులు తొమ్మిది మంది, వర్ణన వస్తువు, చెప్పవలసిన ఛందము, ఉపయోగించవలసిన భాష ఇవన్నియు పృఛ్ఛకులు కోరినట్లే. మరియు వారా పద్యములందు వారి యిష్టము వచ్చిన అక్షరములను నిషేధింప వచ్చును. వాటిని విడిచియే పద్యమును చెప్పవల యును. వారిచ్చిన పదములను కూడ ఆ పద్యములలో నుపయోగింపవలెను. అనగా తొమ్మిది మందికి వర్ణనలు, నిషేధాక్షరులు, దత్తపదులు నిర్వహింప వలెను. ఈ విధముగా నివి ఇరువది యేడు పద్యాలగును. ఇవిగాక ఆకాశపురాణ మత్యాశుకధాకవిత. మిగిలినవి నాలుగు అంశములును కవితాశక్తికి సంబంధిం చినవి కావు. అవి పాండిత్యమునకు సభారంజకత్వమునకు సంబంధించినవి. కవితా విషయములు నాలుగింటిలో మూడింటిని తొమ్మిది మంది నెదుర్కొని చెప్పవలసి యుండుటయే గొప్ప. తిరుపతి కవులు దానినే కీర్తిపతాకగా తమ యష్టావధానములందు నిలుపుకొనిరి.

మిగిలిన యష్టావధానులు వర్ణన కొకనిని, నిషిద్ధాక్షరి కొకనిని, దత్తపది కొకరిని, సమస్య కొకనిని పెట్టుకొని ఆశుకవిత్వమును తప్పించుకొని, అప్ర స్తుత ప్రసంగము వారిని, వ్యస్తాక్షరి వారిని, లెక్కల వారిని, ఘంటా గణ నము వారిని అందరను పృచ్ఛకులుగా పరిగణించి నెట్టుకొని పోవుదురు.

తిరుపతి కవులు కొన్నిచోట్ల ద్విగుణితాష్టావధానమని[37] చతుర్గుణితా ష్టావధానమని[38] కూడ చేసి యున్నారు. నలుబది పద్యములతోను, నలుబది మూడు పద్యములతోను అయిన అవధానములను శతావధానములన్నప్పుడు[39] నలుబది మూడు పద్యముల దాని నింకొకచో చతుర్గుణితాష్టావధాన మనుటలో విశేష మేదియైన నుండవలయును గదా!

37. శతావధాన సారము. పూర్వార్ధము. 24.
38. ,, ,, ,, 26.
39. ,, ,, ఉత్తరార్ధము. 69, 139.

# ౫. శతావధానము

శతావధానమునకు పృచ్ఛకులు నూర్గురు. వారి ప్రశ్నముల కన్నింటికిని వారు కోరిన ఛందస్సులలో అవధాని పద్యములు చెప్పవలయును. ఏ ప్రశ్నమునకా ప్రశ్నగా సమాధానము చెప్పి ముగించుకొనుట కాదిక్కడ పద్ధతి. నూరు ప్రశ్నలకును ఒక్కొక్క పాదముగా సమాధాన పద్యములను మొదలు పెట్టవలెను. అనగా అడిగిన ప్రశ్నకు వెంటనే సమాధానములో నొక పాదమును మాత్రమే అవధాని చెప్పును. ఆ విధముగా వరుస క్రమమున నూరు ప్రశ్నలకును చెప్పును. తిరిగి మొదటికి వచ్చి క్రమముగా రెండవ పాదమును చెప్పుకొనుచు పోవును. మూడు నాలుగు పాదములను గూడ ఆ విధముగానే పూర్తి చేయవలయును. చిట్టచివరకు ఆ నూరు ప్రశ్నముల పద్యములను సరిగా అప్పజెప్పవలయును. తమ తమ ప్రశ్నలకు చెప్పబడిన ఆయా పాదములను పృచ్ఛకులు వ్రాసి పెట్టుకొని అవధాని ధారణా కౌశలములను పరీక్షించెదరు.

(1) పృచ్ఛకుల ప్రశ్నలన్నియును వారిచ్చిన వరుసలోనే అవధానికి జ్ఞాపకముండవలెను.

(2) ఏ పృచ్ఛకు డే ప్రశ్నము నిచ్చినదియు కూడ గుర్తుండవలెను. వారు స్థలములు మార్చి కూర్చున్నప్పుడు అవధాని ఇబ్బంది పడరాదు.

(3) అడిగిన ప్రశ్నకు వెంటనే స్ఫురించెడునట్టి సమాధానమును తుది దాక జ్ఞాపకముంచు కొనవలెను. లేనిచో తరువాతి పాదములు చెప్పుటకు తిరిగి వచ్చినప్పుడు మొదటి పాదములతో నన్వయించునట్లు పద్యమును కొనసాగించుటకు వీలుండదు. అందువలన మొదటి పాదము వద్దనే అవధాని తాను చెప్ప దలచుకొన్న యర్థమును నిశ్చయము చేసికొనవలయును. ఇట్లు నూరు ప్రశ్నములకును సమాధాన స్వరూపమును నిశ్చయము చేసికొన్న తరువాత అనగా ప్రథమ పాదములను చెప్పిన తరువాత శతావధానికి సగము బరువుతీరును. ఇక మిగిలినది పద్యములను కొనసాగించుట. అవధానికున్న ఆశుధారయే ఆ పనిని చూచుకొనును. అప్పటి నుండియు అవధాని శక్తినంతయును ధారణకే ఉపయోగించును.

సందర్భ శుద్ధియైన ప్రజ్ఞ- అమోఘమైన ఆశుధార-అనాహతమైన ధారణ- ఈ త్రిపుటి ఎవనియందెంత పటువుగా నున్నదన్నదానిని బట్టి వాని శతావ

ధాన కౌశలముండును. "శతావధాన విధాన సమయమ్మునందున కవిహృదయము కుశాగ్రమునకన్న నిశితమై" యుండవలయునని శతావధాని శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారి యభిప్రాయము. తాదృశమైన జాగ్రత్తయే అవధానము.

శతావధానమును గురించి స్వానుభవము మీద తిరుపతి వేంకటకవులు చెప్పిన మాటలు మరియు గమనింపదగినవి.

తెలియ దదేమొకాని కడుతేలిక యౌనట; పందమంది కో
ర్కెలు మదినూని వారలు పఠించిన వృత్తములన్ గ్రహించి వా
రలకొక పాదమున్నొడివి వ్రాసిన పిమ్మట తక్కుపాదముల్
కలయగ జెప్పి పిమ్మట నఖండముగాగను నూఱుపద్యముల్
బలువడి నప్పగించుపని; పల్కగవచ్చును గాని చేయుటల్
చులకనగాదు[40];......

నిజముగా సంపూర్ణ శతావధానమును చేయుట చెప్పినంత సులభముకాదు. తిరుపతి వేంకట కవులతో పోటి చేసిన ఆనాటి ఆశుకవులు చాలామంది తాముసు శతావధానులమనియే చెప్పుకొందురు. వారిలో సంపూర్ణ శతావధానములు చేసిన వారి సంఖ్య చాలతక్కువనియే చెప్పవలయును.

అష్టావధానముకాక ఆయా ప్రశ్నలకు సమాధానపద్యములు ధాటిగా చెప్పి అందుకొన్నియైనను అప్పగించగలిగిన వారందరును శతావధానుల క్రిందనే లెక్క గట్టుకొనుట యైనది.

శతావధానులుగా ప్రసిద్ధులయిన కొప్పరపు సోదరకవులు, రామకృష్ణ కవులు, దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, తమ్మన్నశాస్త్రి, శ్రీపాదకృష్ణమూర్తి, కాశీ కృష్ణాచార్యులు, పశ్లె పూర్ణ ప్రజ్ఞాచార్యులు, పిశుపాటి చిదంబరశాస్త్రి, గాడేపల్లి వీరరాఘవశాస్త్రి, దోమా వెంకటస్వామి గుప్త, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి మొదలయిన వారందరునుకూడ చేసిన శతావధానములలో సంపూర్ణ శతావధానము లల్పసంఖ్యాకములే. రెండు మూడట్లు చేసి ఇకమిగిలిన చోట్ల ఏబదిమందికని, అరువదిమందికని చేసెడివారు. ఒకసారి శతావధానము చేసినచో నతడు శతావధానియే. అష్టావధానికూడ అంతే. శతావధానికి అష్టావధానము సులభము. సాధారణముగా ఎనిమిదంకెను దాటించి ఆశుపు చేత చెప్పుకొని పోగలడు.

40. నానారాజ సందర్శనము. పూర్వార్థము. 33.

ధారణ మరింత సులభము. కొప్పరపు కవులంతటివారు చేసిన శతావధానములే పదునొకండు[41]. అందులో సంపూర్ణ శతావధానములు రెండు మూడు. గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు చేసిన శతావధానములిరువదియైదు[42]. ఇందు సంపూర్ణ శతావధానము లెన్నియున్నవో తెలియదు. వేలూరి శివరామశాస్త్రి గారు చేసిన శతావధానములు నాలుగు[43]. గుంటూరు కాలేజీ శతావధానము సంపూర్ణ శతావధానమే. మిగిలినవాటి విషయము తెలియదు. రెండు వందలకు మించిన అవధానములు చేసిన తిరుపతి కవులు సంపూర్ణ శతావధానము లెన్ని చేసినారనగా లెక్కపెట్టవలసినదే గదా[44].

## 1. శతావధాన ప్రశ్నలు :—

1. కాళీమాతను విద్యున్మాలా వృత్తమున స్తుతించునది. [అవధాని ఉభయ భాషాకవియైనప్పుడు పృచ్ఛకుడు భాషనుకూడ నిర్దేశింప వచ్చును.]
2. మీ గురువులను చంపక మాలావృత్తమున స్తుతించునది.
3. గురువుల యెదుట అవధానము చేయుటను గూర్చి మీకెట్లున్నది.
4. ఈ సభను ఉత్పలమాలలో వర్ణింపుడు.
5. ఈ సమస్యను పూరింపుడు. సమస్య......
6. పిల్లలు నోట వ్రేలు వేసికొని చీకుటను సీసమున వర్ణింపుడు.
7. నిర్యతి ప్రాసకవిత్వమును గురించిన మీ యభిప్రాయమును మత్తేభ వృత్తమున చెప్పగలరు.
8. ఈ సమస్యను పూరింపుడు. సమస్య......
9. ఈ సమస్యను పూరింపుడు. సమస్య......
10. ఈ శ్లోకమును మత్తేభమున తెనుగుచేయుడు. శ్లోకము...
11. తోకచుక్కను సీసపద్యమున వర్ణింపుడు.
12. సత్కవిత్వమనగానేమో శార్దూల వృత్తమున చెప్పుడు.

---

41. కొప్పరపు సోదరకవుల చరిత్ర. 73.
42. చమత్కార కవిత్వము. 146-149.
43. గుంటూరు కాలేజీ శతావధానము. చివరిపేజీ.
44. తిరుపతి కవుల సాహిత్య సమీక్ష. 30.

13. కృష్ణరాయబారములో కర్ణ కృష్ణ సంభాషణమును ఉత్పలమాలా వృత్తమున చెప్పునది.
14. శ్రీ కృష్ణుని లయవిభాతి పద్యమున స్తుతించునది.
15. అలుకు గుడ్డను సీసపద్యమున వర్ణించునది.
16. విజయవిలాసము నందలి ఈ పద్యమునకు ప్రతిపద్యమును చంపక మాలగా చెప్పునది. పద్యము......(1-112)
17. కవిరాజ విరాజిత వృత్తమున గండుచీమను వర్ణింపుడు.
18. నిజమైన కవుల కవితలను శార్దూలమున ప్రశంసించునది.
19. అచ్చతెనుగున ఉత్పలమాలలో లక్ష్మిని వర్ణించునది.
20. ఆంగ్ల విద్యార్థుల చిత్త ప్రవృత్తులను వర్ణింపుడు.
21. ఉత్పలమాలలో కుకవిత్వమును గూర్చి చెప్పుడు.
22. ఈ విషయమును మత్తేభమున కల్పన చేసి చెప్పుడు. విషయము...
23. ఈ తిరుపతి వేంకటేశ్వరులే ఆ తిరుపతి వేంకటేశ్వరులని శ్లేషాత్మక ముగా సీసపద్యమున వర్ణింపుడు.
24. ఈవిషయమును శార్దూలమున కల్పనచేసి చెప్పునది. విషయము...
25. గానము-కవిత్వము-వీటి ప్రయోజనమును కందమున వర్ణింపుడు.
26. ఈ పదములనుపయోగించి ఒక చంపక మాల చెప్పునది. పదములు.
27. మంచి సొగసుకత్తెనొకదానిని సీసమున వర్ణింపుడు.
28. మత్తకోకిలావృత్తమున శరదృతువును వర్ణింపుడు.
29. ఈ యవధానమున కవకాశము కల్పించిన వారిని గురించి ఉత్పల మాలావృత్తమున చెప్పునది.
30. ఈ సమస్యను పూరించునది. సమస్య......
31. పంచచామరమున వేపకాయను వర్ణించునది.
32. ఈ సమస్యను పూరించునది. సమస్య......
33. రామరావణ సంవాదమును మహాస్రగ్ధర యందు చెప్పునది.
34. శార్దూల వృత్తమున వసంత ఋతువును వర్ణించునది.
35. శివవిష్ణు శ్లేషాత్మకముగా అనుష్టుప్పును చెప్పునది.
36. కవిత్వ ప్రయోజనమును చంపకమాలయందు చెప్పునది.
37. తెనాలిరామలింగని గూర్చి ఒక ఉత్పలమాల చెప్పునది.

38. జ్ఞప్తిహీనుని గురించి శిఖరిణీ వృత్తమున చెప్పుడు.
39. పటమునందున్న ఈ బాలుని వర్ణింపుము. పటము.......
40. లయగ్రాహి పద్యమున సూర్యోదయ పద్మములను వర్ణించునది.
41. ఈ సమస్యను పూరించునది. సమస్య......
42. ఈ లోకోక్తినుపయోగించి గీతము చెప్పుడు. లోకోక్తి......
43. చంపకమాలావృత్తమున కప్పను వర్ణించునది.
44. క్రైస్తవులను చూచి హిందువులు నేర్చుకొనవలసినది సీసమున చెప్పుడు.
45. ఆ యెదురుగానున్న గుడ్లగూబను గురించి సీసపద్యము చెప్పుడు.
46.- శార్దూల వృత్తమున ఉచ్ఛిష్ట గణపతిని స్తుతింపుడు.
47. ఆకాశమును ఉత్పలమాలయందు వర్ణించునది.
48. చంద్రోదయమును మందాక్రాంతమున వర్ణించునది.
49. పరశురామ విజృంభణమును శిఖరిణీ వృత్తమున వర్ణించునది.
50. సీసపద్యమున గడ్డిపోచను వర్ణించునది.
51. కుర్గురు దొరసానిగారి కీర్తిని సీసపద్యమున వర్ణింపుడు.
52. బెస్తవానిని సూర్యునితో పోల్చుచు కందపద్యము చెప్పుడు.
53. ప్రభాత కాలమున మానవుల చర్యలను సీసమున వర్ణింపుడు.
54. దోమను దోమతెరను గురించి చంపకమాలలో చెప్పుడు.
55. శార్దూలవృత్తమున కలము పాళీని కీర్తించునది.
56. విరహిణీ హృదయమును అమావాస్యనాటి చంద్రునితో పోల్చుచు మందాక్రాంత వృత్తమును చెప్పునది.
57. ఈ లోకోక్తి వచ్చునట్లుగా చంపకమాల చెప్పుడు. లోకోక్తి...
58. రెల్లు పూవులోని నూగును స్రగ్ధరావృత్తమున వర్ణించునది.
59. తొమ్మిదేండ్లవాడు గజముండునా గజమున్నరయుండునా? ఇందుకు సమాధానము మత్తకోకిల యందు చెప్పుడు.
60. అవధానములలో అప్రస్తుత ప్రశంసకులనుగూర్చి కందము చెప్పుడు.
61. తాటిచెట్టునకును విష్ణునకును శ్లేషకల్పించి అచ్చ తెనుగున సీస పద్యమును చెప్పుడు.
62. శార్దూలము మనుష్యుని మీదపడవచ్చుటను శార్దూలమున వర్ణింపుడు.
63. ఈసమస్యను గీతమున పూరింపుడు. సమస్య ... ...

64. లయగ్రాహివృత్తమున చిటిచాపను వర్ణింపుడు.
65. కందమున కందపద్యలక్షణమును చెప్పుడు.
66. ఈ సభాధ్యక్షులను సీసపద్యమున వర్ణింపుడు.
67. అచ్చతెనుగున సీసపద్యమున జన్మభూమిని గూర్చి చెప్పుడు.
68. హాలికుడైన గృహస్థుని శార్దూలమున వర్ణించునది.
69. బిందుపూర్వక తకారముతో వృత్త్యనుప్రాసమును కల్పించుచు ఉత్పలమాలావృత్తమున వసంతమును వర్ణించునది.
70. ఈ పద్యమును సంస్కృతమునకు ననువదింపుడు. పద్యము...
71. బిడాలోపాఖ్యానపుగాథను శార్దూలమున చెప్పుడు.
72. ఈ లోకోక్తి నుపయోగించుచు శార్దూల వృత్తమున దొంగను వర్ణించునది. లోకోక్తి... ...
73. ఈ సమస్యను గీతమున పూరింపుడు. సమస్య ... ... ...
74. చిల్ల పెంకును గురించి ఉత్పలమాల యందు వర్ణింపుడు.
75. అచ్చతెనుగున ఉత్పలమాలయందు గులాబిని వర్ణించునది.
76. స్కూలు ఫైనలు పరీక్షలనుద్దేశించి ఉత్పలమాలను చెప్పునది.
77. వితంతుల మహాసభను గీతపద్యమున వర్ణింపుడు.
78. గీతమున పెనిసిలును కీర్తింపుడు.
79. సంభావనలప్పుడు బ్రాహ్మణుల అఘాయిత్యమును శార్దూల వృత్తమున వర్ణింపుడు.
80. భూమధ్యరేఖ దండెయని సూర్యచంద్రులు తక్కెడ బిళ్లలని శార్దూల పద్యమున వర్ణింపుడు.
81. ఊరికి నిప్పంటుకున్నప్పటి దృశ్యమును శార్దూలమున వర్ణింపుడు.
82. ఈ శ్లోకమును ఆంధ్రీకరింపుడు. శ్లోకము.........
83. సరస్సును సౌధముతో పోల్చుచు ఉత్పలమాలను చెప్పుడు.
84. పెండ్లిలో కావడిబద్దవిరిగిన నీళ్ళ బ్రాహ్మణుని పరిస్థితిని ఉత్పలమాలయందు వర్ణింపుడు.
85. దీపమును జ్ఞానముతో పోల్చుచు చంపకమాలను చెప్పుడు.
86. వేటకు బోయెడు కిరాతులను గ్రామ్యభాషా పదములతో మత్తకోకిల యందు వర్ణించునది.
87. సూదిమొనమీద నొక సీసమును చెప్పుడు.

88. కాలిలో తుమ్మముల్లు విరుగుటను కందమున చెప్పుడు.
89. పతివ్రతల పేర్లు పెట్టుకొనుచున్న వేశ్యలను గీతపద్యమున వర్ణించునది.
90. ఈ శ్లోకమును చంపకమాలగా నాంధ్రీకరింపుడు. శ్లోకము...
91. కోటు గుండీలను గురించి మత్తేభమును చెప్పుడు.
92. ద్విభార్యా యుక్తుని కష్టసుఖములను మత్తేభ వృత్తమున వర్ణింపుడు.
93. వర్షమును యుద్ధమును పోల్చుచు ఉత్పలమాలను చెప్పుడు.
94. శార్దూల విక్రీడితమున జ్ఞాన ప్రసూనాంబాదేవిని దేవభాషయందు స్తుతించునది.
95. పూర్వయుగ ధర్మములను ఉత్పలమాలయందు చెప్పుడు.
96. ఇప్పుడు మీగురించి మీగురువు లేమనుకొనుచుందురో ఉత్పలమాలా వృత్తమున చెప్పుడు.
97. ఈ పదములనుపయోగించి గీతపద్యమున సూర్యుని వర్ణింపుడు పదములు ... ... ... ... ... ...
98. సజ్జకంకి తిను కాకి వడిశెల తాకి చచ్చుటను చంపకమాల యందు వర్ణించునది.
99. ఈసమస్యను ఇంద్రవజ్రా వృత్తమున పూరింపుడు. సమస్య...
100. మీ పరమ గురువులను సీసపద్యమున స్తుతించునది.

## 2. శతావధాన విధానము

ఈ శతావధాన ప్రశ్నలను చూచినచో శతావధాన విధాన లక్షణము కొంతవరకు తెలియ గలదు. ప్రత్యక్షముగా చూడవలసిన దానిని పరోక్షముగా తెలిసికొనుట కిది యొక మార్గము.

పృచ్ఛకులు అవధానిని అనేక విధములుగా నియమబద్ధుని గావించు చున్నారు. అడిగిన దాని కందముగా సమాధానము చెప్పునంతవరకే ఆయనకు స్వేచ్ఛ. మరే విషయమునను లేదు. వస్తువును, ఛందస్సును, భాషను, అలంకారమును - నాలుగింటిని పృచ్ఛకుడు స్వాధీనము చేసికొని మాటాడుచున్నాడు. కవితా సామగ్రి యంతయును పృచ్ఛకుని చేతిలో నున్నది. పృచ్ఛకులు కవులు కారు. ఒకవేళ అంతకు ముందైనను అప్పుడు కాకుండ పోవుదురు. కవి గాని

వాని చేతిలో కవితా సామగ్రిని పెట్టి వాని యిష్ట ప్రకారము చెప్పవలసి వచ్చుటచే అవధాన కవిత్వము మూడు వంతులు కవిత్వము కాకుండ పోవలసి వచ్చుచున్నది. చెప్పెడు వాడెప్పుడును లోకువయే కదా యని యడిగెడు వాని యుద్దేశ్యము. పృచ్ఛకులవధానినట్లే యడుగుదురు.

ముందు వారి చూపు ఛందస్సుమీద పడుచున్నది. విద్యున్మాల-శిఖరిణి-లయవిభాతి - కవిరాజ విరాజితము - పంచచామరము - మత్తకోకిల - మహాస్రగ్ధర - లయగ్రాహి - మందాక్రాంత - స్రగ్ధర - ఇంద్రవజ్ర - ఈ పది పదునొకండు ఛందస్సులను సాధారణముగా తెలుగు భాషాకవులు వ్రాయరు. అందుకే వీటికి విశేష వృత్తములని కూడ పేరు. విశేష వృత్తములను నిదానముగా వ్రాయవచ్చును గాని ఆశువున కొదిగించుట అసాధ్యము కాదు కాని కష్టసాధ్యమనవలయును. ధారణకుకూడ అభ్యాసమైన ఛందస్సులొదిగినట్లుగా కానివి యొదగవు. అందువలన నీ విశేష వృత్తములు చెప్పుటకును, జ్ఞాపకము పెట్టు కొనుటకును కూడ అంతగా నసువైనవి కావు. కావు గనుకనే పృచ్ఛకులడుగుదురు. అవునన్నట్లుగా అవధాని నెగ్గుకొని రావలయును.

విశేషమైన క్రొత్త ఛందస్సు కాకపోయినను సీసపద్యము కూడ ఇబ్బంది కలిగించునదియే. వృత్తమునకువలె గణ క్రమనియతి లేనందున పద్యమును చెప్పునప్పుడు కవి జాగ్రత్త పడనిచో అది ధారణకు నిలువదు. ఇక్కడ జాగ్రత్త యంతయును రచనా శిల్పము మీద నుండవలయును. గణములకు పదములను కూర్చుకొనుటగా - పాదాంతముల నొక సమతను సంపాదించుటగా-పాదమున నొక కొంతభాగమును తరువాతి పాదముల యందు పునరావృత్తము చేయుటగా - పదమధ్య యతిని పాటింపక పోవుటగా - ఇట్లనేక పద్ధతుల నవలంబించి పద్యమును ధారణ కనుకూలముగా అవధాని చెప్పకొనవలయును.

అందరు పృచ్ఛకులును సమస్యలను సమకూర్చలేరు. సమస్యా పూరణమే కాదు - సమస్యా కల్పనము కూడ సమస్యయే. అందువలన అంతకు పూర్వము ప్రసిద్ధముగా నున్న సమస్యలనే యిచ్చి క్రొత్తగా పూరింపుమందురు. అవి యంతకు మునుపు మరెవరి చేతనో పూరింపబడి యుండును. ఆ పూరణమున కంటే ఈ యవధాని గారి పూరణము నందలి విశేషమేమని చూచెదరు. అవధాని యొక్క సద్యస్స్ఫూర్తికి ఈ సమస్యా పూరణ మొక నికషము. విరుద్ధ లక్షణ లక్షితములు - అర్థాంతర న్యాస వాక్యములు - దుష్కర

ప్రాస పాదములుగా సమస్యలు కల్పింపబడును. క్రమమును పాటించి, అన్వయమును మార్పు కూర్పులను లోనుజేసి, ముందు వెనుకలుగా అక్షరములను కూర్చి సమస్యలోని పద బంధములను విడిచి విషయమును సందర్భ పఱచి అవధాని వాటిని పూరింపవలయును. ఇందు మరొక చిత్రమేమనగా ఒక పద్య పాదము నిచ్చి దాని నాపద్యమును గాక మరొక పద్యముగా పూరింపవలయు ననుట. ఏ పద్యపాద మే పద్యమునం దిముడునో అవధానికి తెలియ వలయును. అది గర్భ కవిత్వ తత్వము తెలియుట. ఈ విధముగా నున్న సమస్యాపూరణ మొక సమస్యయే కదా !

పృచ్ఛకులు భాషను కూడ నియమించెదరు. సంస్కృతములో చెప్పుము- అచ్చ తెనుగులో చెప్పుము - అని. ఆంధ్ర భాషా కవి యొక్క ఆశుధారకు సంస్కృత మొదిగి పోగలదు గాని అచ్చ తెనుగొదుగదు. ఇక్కడ ధార కుంటు వడక తప్పదన్నంత గండమున్నది. దీనితోపాటు అలంకారమును, ఛందస్సును కూడ నియమించినచో అవధాని అటో ఇటో తేలిపోవలయును.

అలుకుగుడ్డ-వేపకాయ - పాళీ - చిటిచాప - చిల్లపెంకు - సూది మొన- తుమ్మముల్లు - గడ్డిపోచ - గండుచీమ - కోటుగుండి - ఈ మొదలయిన అల్ప విషయముల మీద పెద్ద పెద్ద పద్యములను చెప్పుమనుట - విశేష వృత్తములనుకోరుట - అవధాని యొక్క కల్పనాశక్తికి పెద్ద పరీక్ష.

తాటిచెట్టు - విష్ణువు; సరస్సు - సౌధము; యుద్ధము - వర్షము; బెస్తవాడు - సూర్యుడు; తిరుపతి వేంకటేశ్వరస్వామి - తిరుపతి వేంకట కవులు - ఈ మొదలయిన విరుద్ధ విషయములను సుసంబద్ధములుగాచేసి చెప్పుమనుట అవధాని ప్రజ్ఞాపాటవమును పరీక్షించుట.

ఫలానా కావ్యమునందలి ఫలానా పద్యమునకు ప్రతిగా పద్యమును చెప్పమన్నప్పుడు, బిందుపూర్వకతకారముతో వృత్త్యనుప్రాసమును కల్పించుచు పద్యమును చెప్పుమన్నప్పుడు అవధాని యొక్క ప్రతిభా వ్యుత్పత్తులు రెండును "నీవా నేనా" అని మేల్కొనుటకు పరీక్ష.

సంస్కృత సమస్యలను పూరించుమనుట, సంస్కృత శ్లోకములను తెనుగు చేయుమనుట, తెలుగు పద్యములను సంస్కృతీకరింపుమనుట అవధాని

యొక్క సంస్కృత భాషా పాండిత్యమునకును అందలి కవితా శక్తికిని పరీక్షాస్థానము.

ఇక మిగిలిన వర్ణనాదికములన్నియును అవధానియొక్క ఆశు కల్పనలకు - చమత్కారములకు-పద్యరచనా పాటవమునకు లక్ష్యములుగా నుండును.

ఈ విధముగా పృచ్ఛకులు కవులైనను ముఖ్యముగా పండితులయిన పెక్కు భంగుల నవధానిని తప్పుత్రోవల బట్టించుటకు యత్నించెదరు. అవధాని కదియొక పరీక్ష కాగా నితరులకు వినోద ప్రాయముగా నుండును. విజయము అవధానికి ధన గౌరవసులను సమకూర్చును. అపజయము అవమానాపహాస్యములకు కారణమగును.[45] ఈ విధానమున విజయ గౌరవములను పొందినది శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు.

## 6. సహస్రావధానము

ఈ ప్రక్రియను తిరుపతి వేంకట కవులు ప్రత్యేకము ప్రదర్శింపక పోయినను తామాపని చేయగలమని మాత్రము స్పష్టముగా ప్రకటించినారు.

ఒక నూతేయన నేమి లెక్క వినుడోహో పండిత శ్రేష్ఠులా
ర ! కడున్ వేగమె వేయిమంది కయినన్ రమ్యస్థితుల్ మీఱ నా
శుకవిత్వంబొనరింప నేరుతుము శ్రీ శూలి ప్రియా మానసీ
య కటాక్షమ్మున తగ్గ కాలమును మాకర్పించి కూర్చున్నచోన్.[46]

వేయి మందికి వారి వారి ప్రశ్నలను పాటించి ఆశువుగా పద్యములు చెప్పుకొనిపోవుట మాత్రమే సహస్రావధానమునకు లక్షణమా ? ధారణ పని లేదా? ప్రక్రియ వేరైనందుల కిందిదే విశేషమా? కావచ్చును.

శ్రీ సత్యవోలు సోమసుందర కవి గారి ఈ క్రింది పద్యము తిరుపతి కవుల సహస్రావధాన సామర్థ్యము నుపలక్షించుచున్నట్లే యున్నది.

45. గుంటూరు కాలేజీ శతావధానము. అవధానములు. xxxiii.

46. తిరుపతి కవుల సాహిత్య సమీక్ష. 34.

వితతప్రజ్ఞ శతావధానతయు నేవేళన్ సహస్రావధా
నతయున్ గల్గిన వీరిచిత్తమునకే నాళీకనామంబు లౌ
శతపత్రంబు సహస్రపత్ర మనుటల్ సందర్భ మౌగాక స
మ్మతమా ! యెల్లెడమానసాబ్జమను సామాన్యోక్తి చర్చింపగన్. 47

శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు పంచ సహస్రావధానులుగా ప్రసిద్ధి నొందినారు గదా! మరి దానిమాట యేమి? శతమునకే తల ప్రాణము తోకకు వచ్చుచున్నప్పుడు సహస్రములు పంచ, సహస్రములు అనుటయే గాని అడిగెడు వాడెవడు! అందువలన ధారణ పట్టుటతో నిమిత్తము లేని ఆశుపద్య రచన వందను దాటి నప్పటి నుండియు సహస్రావధానము క్రిందనే చలామణి యగుచున్నదని యర్థము. అర్థము నిజమేకావచ్చును గాని సహస్రావధానులన్న బిరుదు మోసిన వారింకొకరు కనిపించుట లేదు. ఆ ఫక్కీని కని పెట్టిన దీయనయే అనియు నందురు.48

అవసరము పడి అన్నియు కలిసివచ్చి అయినదని యనిపించవలసి వచ్చినచో సహస్రావధానము కూడ ఒక అవధాన ప్రక్రియా విశేషమే యగును.

శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు అయిదు వేల కార్డుల మీద ఏవో రక రకముల బొమ్మ లంటించి దగ్గరనుంచుకొనెడివారు. పృచ్ఛకులంత మంది యుండరు గనుక ఉన్న వారికి వారా కార్డుల నిచ్చి అందు మీ యిష్టము వచ్చిన కార్డును దీసి - దాని క్రమ సంఖ్యను చెప్పుడని యడిగి - ఆ సంఖ్యను విని, ఆ సంఖ్య గల కార్డు మీది బొమ్మను గాని వ్రాసి పెట్టియున్న విషయమును గాని గుర్తుకు తెచ్చుకొని దానిమీద పద్యము చెప్పుదురు. అయిదువేల విషయములను గుర్తుపెట్టుకొనుటయే అందలి విశేషము. అదే పంచసహస్రావధానము. తీసిన కార్డులు అడిగిన ప్రశ్నలు ఎన్ని యున్నను అవి అయిదువేలలో నుండి తీయబడినవే కనుక దానికి పంచసహస్రావధానమనియే పేరు. ఉన్న మనుష్యులను బట్టి తీయబడిన కార్డుల సంఖ్యయుండును. ఒకచోట యేబది మరొక చోట వంద- ఇంకొక చోట నూటయేబది - ఈ విధముగా నుండును. శ్రీసుబ్రహ్మణ్య శాస్త్రి గారు మంచి సరసమైన ఆశుధారా రచనా శక్తి కలవారు. అందు

47. శతావధాన సారము. అనుబంధము 161.

48. నవ్యాంధ్ర సాహిత్య వీథులు. ప్రథమభాగము 33.

వలన వారి యవధానములు సదస్యులను మిక్కిలిగా నలరించు లక్షణములు కలిగియున్నవి.

## అర్వాచీనులు - అవధానములు

నవ్యకవితా రచనమొక ఉద్యమముగా ప్రారంభ మైనప్పటి నుండియే అవధానములు ఆశుకవితా ప్రదర్శనములు కొంత వెనుక బట్టినవి. ఆశుకవితా సన్యాసమును స్వీకరించియేకదో రాయప్రోలువారు నవ్యకవితా పీఠాధిపతు లయినది! జాతీయోద్యమ తీవ్రప్రభావము వలన కూడ గారడీరచనలు వెనుక బడినవి. ప్రాచీన ఫక్కినననుసరించి కావ్యములు వ్రాసెడు వారుకూడ ఆశుకవితా వధానములనాదరింపలేదు. భావకవులు-అభ్యుదయకవులు మొదలయిన అత్యం తాధునికులకు ప్రాచీన విషయములెట్లును రుచింపలేదు గనుక వారును ఆశుకవి తావధానములను పట్టించు కొనలేదు.

మరియు భారతదేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత కవిపండి తులను వార్షికములిచ్చి పోషించుటను గౌరవముగా భావించుకొనెడు చరిత్ర గలిగిన సంస్థానములయునికి బాగదెబ్బతిన్నది గనుకను కవిత్వమును పాండిత్య మును నమ్ముకొని సంసారములు గడుపుకొన వచ్చునన్న నమ్మకము పోయి విద్వాంసులకును వాటియందంతకుమునుపుండెడి ఆదరము నశించినది. మరియు నీకాలమున కవిపండితులలో వెనుకటి జిగీషామనీష క్రమముగా క్షీణించి పోయినది. దానిస్థానమున అన్యోన్య స్నేహదృష్టి-పరస్పర సహకారదృష్టి-మొదలయిన సల్లక్షణము లెక్కువైనవి. కవితాశక్తి ఈకాలమున రాజసముకాక-సాత్త్వికమైనది. అందువలనను ఆశుకవితావధానముల ప్రదర్శనము లల్పాల్పములు గానే యున్నవి.

ఇప్పుడు జరిగెడు ఆశుకవితలు-అవధానములు కర్తలకును కారయితలకును తాత్కాలిక ప్రయోజనామోదముద్రాముద్రితములుగా నున్నవి. ఇప్పటి అవధానములన్నియు అష్టావధానములే. శతావధానములకు శక్తిలేదు. ఓపికయును లేదు. పృచ్ఛకులు లభించుటయు కష్టముగానేయున్నది. అయినను కొందరు సలక్షణముగా అవధానములను చేయుచున్నారు. బ్రహ్మశ్రీ దివాకర్ల వేంకటావ ధాని-సుబ్బన్న శతావధాని-ప్రసాదరాయకులపతి- పేరాల భరతశర్మ - కోట

వీరాంజనేయ శర్మ మొదలయిన వారినింకను పేర్కొనవచ్చును. ఈ అవధాన ప్రదర్శనములకు భవిష్యత్తింకను కలదనుటకు వచనకవితలు వ్రాయువారు వెనుకకు తిరిగి వచ్చి చక్కని అవధానకవిత్వము నలవాటు చేసికొనుచున్నారనుటయే నిదర్శనము. ఇక్కడ శ్రీమాన్ కోవెల సుప్రసన్నాచార్యులవారి పేరు చెప్పవలయును.

ఈ పైన పేర్కొన బడినవారి అవధాన ప్రదర్శనములు తద్విద్యావైదుష్యము కలిగి పండిత పామర సహృదయ జనమనోరంజకములై బహుళార్థ సాధకములుగా నున్నవి. ఇదొకమంచి శుభసూచన.



# 4. చాటు కవితలు

## 1. స్వరూప నిరూపణము

ఆశు కవిత్వము:లోనే చాటుపద్యము లొకరకముకావచ్చును. ఇవన్నియు కాకపోయినను కొన్నియైనను ముక్తకలక్షణ లక్షితములు. ముక్తకమనగా ఏపద్యమున కాపద్యమే. దానికి మరొకదానితో సంబంధముండదు. అందువలన ప్రతిముక్తక పద్యమునకును ముందువెనుకలను మనమే సమకూర్చు కొనవల యును. చాటుపద్యములన్నింటినీదృశముగా కథలు సమకూర్చ బడియుండును. ఆయా విషయములు తెలిసినప్పుడే చాటువులర్థములై అందలి చమత్కారము లా స్వాదయోగ్యములగును.

చాటువులనగానేమి? ఆవిషయము తరువాత. చాటుపద్యములు ముఖ్య ముగా "కవుల వివాదములు-రాజుల చరిత్రములు-మంత్రుల తంత్రములు-వీరగాథలు-శృంగారఘట్టములు-హాస్య ప్రసంగములు-దాతృ ప్రశంసలు-లోభి నిరసనములు పున్నగు విషయములకు సంబంధించి" యున్నవి. మరియు "చాటువులు ఆనాటి ప్రభువులకు ప్రజలకును గల కవితా రసజ్ఞతను, రసిక తతోడి త్యాగమును, అప్పటికవుల ఆశుకవితా ప్రాగల్భ్యమును వెల్లడించుచు, ఆ కాలపు దేశపరిస్థితులకును, సాంఘికాచార వ్యవహారములకును తార్కాణ ములుగానున్నవి." ఈ విధముగా చూచినచో గతకాలము విశేషములను గర్భముల యందిముడ్చుకొని మనకు ప్రదర్శించి మన విజ్ఞాన వైభవమునింకను పెంపొందింప నిలిచిన పెన్నిధులని చాటువులను చెప్పవలయును.

వినువారి హృదయములకు చమత్కారము నొదవించి ఉల్లాసమును కలిగించు మాటలను చాటువులందురనియు, అవి గద్య పద్యములుగా నుండు ననియు కొందరు భావించు చున్నారు. సంస్కృతాంధ్ర భాషల యందు రెండింటను చాటువులన్నవి ఛందో బద్ధములుగానే ఉన్నవి[1] గాని గద్యములుగా లేవు. "చాటుపద్యమణి మంజరి" ద్వితీయ భాగమున రాజప్రశంసా స్తబకము

---

1. విజ్ఞాన సర్వస్వము. ఆరవసంపుటము. 667.

నందు బిరుదావళులు అనుశీర్షికను కొన్ని గద్యరచనలున్నవి. అవి ఆయా రాజుల విజయ ప్రశస్తులు. ఆ ప్రశస్తులను వినుపించుటకు ఆస్థానమున నుద్యోగులుండెడి వారు. అవి చాటు రచనలుకావు. బిరుదు గద్యలను ఆస్థాన విద్వాంసులు జాగ్రత్తగా కూర్చెదరు. ఒక విధముగానవి సుప్రభాతముల వంటివి.

చాటువులనగా నిట్లున్నవిగనుక మనమిట్లను కొనుచున్నాముగాని మన ప్రాచీనుల దృష్టి మరొక విధముగానున్నట్లు కనిపించుచున్నది. "చాటు కవిత్వ తత్త్వరస సాగర పారగులయ్యు సత్కవుల్ పాటిగఁబట్టి విందు రొకపాటివి కావన కన్యకావ్యముల్[2]" ఈ రామకృష్ణుని పద్యమునందలి చాటుకవిత్వమున. కింపైన కవిత్వమని యర్థము వ్రాయబడియున్నది. మరియు పింగళి సూరన్న తననిగురించి "చాటుప్రబంధ రచనా పాటవ కవితుడ"[3] ననిచెప్పుకొన్న దానికి సంఖ్యాకాసంఖ్యాకాది భేద ప్రశస్తకృతుల యొక్కరచనా నైపుణ్యము కలవాడని యర్థము వ్రాయబడియున్నది. మరియును తంజావూరు రఘునాథ నాయకుడు రచించిన జానకీకల్యాణము చాటుకావ్యమని ఆయన కొడుకు చెప్పినాడు. చాటుకావ్యమనగా నదియెట్లుండునో తెలియదు. యక్షగానమే[4] అయియుండునని మాత్రమనుకొనుట యెట్లు.

కావ్య ప్రక్రియా భేదములయిన ముక్తకాదులను చాటు ప్రబంధములుగా లాక్షణికులు భావించుచున్నారు.[5] ముక్తకము - ద్వికము - త్రికము - పంచ రత్నములు - గజమాల - నవరత్నమాలిక - నలినమిత్రమాలిక - ఇందు కళ-నక్షత్రమాల - త్రిశంతి - పంచశతి - శతకము — అష్టోత్తర శతకము — ఇవన్నియు వరుసగా ఒకటి-రెండు-మూడు-ఐదు-ఎనిమిది-తొమ్మిది-పన్నెండు-పదునారు — ఇరువదియేడు - ముప్పది-ఏబది-నూరు - నూట యెనిమిది పద్యములుగా నిబద్ధములయిన ముక్తకాదులు. ఈదృశమైన పద్యసంఖ్యానియమము కవియొక్క ఇష్టమును బట్టి యెంతయైన కావచ్చును. పెద్దనకువలెనే అనంతు

---

2. పాండురంగ మాహాత్మ్యము. 1-13.
3. రాఘవపాండవీయము. 1-12
4. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము. పుట. 35.
5. కావ్యాలంకార చూడామణి. 4-8, 9, 10

డును చెప్పెను.[6] అంతర్నిహితములయిన గుణములనేవో ఉన్నవానిని పట్టు కొని భేదమును నిరూపింపవలయును గాని, పద్యసంఖ్యను బట్టి కావ్య భేద ములను పేర్కొనుటలో సామంజస్యము కనిపించుటలేదు. అదియును గాక ఈ యన్నింటిని కలిపి చాటు ప్రబంధములన్న పేరు పెట్టుటలో ఏమి సార్ధక్య మున్నదియు సమస్యగానే యున్నది. వీటితోపాటు ఉదాహరణాది భేదములు పెక్కు విధములుగా చాటు కృతులుగా నున్నవి. వీటికొకవిధమైన పరి ష్కారము అప్పకవీయమునందు చేయబడినది. అదియు కొసదాక నిలువదు.

అప్పకవి కావ్య భేదములను ప్రబంధ, చాటుప్రబంధములని రెండుగా మాత్రమే చెప్పినాడు. ఇరువది రెండు వర్ణనములతో నున్నది ప్రబంధమన్న తరువాత చాటు ప్రబంధమును గూర్చి ఈ విధముగా వ్రాసిపెట్టినాడు.[7]

కినుగొన సంఖ్యాబద్ధం
బు నసంఖ్యాకంబు నాగ భువి నిరుదెఱగై
తనరారు పూర్వకవి మత
మున నా చాటు ప్రబంధములు జలజాక్షా.
నాల్గు దెగల యుదాహరణములు ముక్త
కాది పంచదశమును సంఖ్యాన్వితములు
గద్య రగడ ద్విపద దండకములు మంజ
రులును సంఖ్యారహిత చాటువులు నృసింహ.

ఈ పద్ధతిని విచారించినచో గద్యలు - ద్విపద గ్రంథములు - మంజరీ ద్విపదలు - శతకాలు - ఉదాహరణములు మొదలయిన వన్నియును చాటువు లనియే చెప్పవలయును.

ప్రాచీనుల నట్లుంచినను ఆధునిక ప్రయోగములందును చాటు శబ్దము విలక్షణముగానే యున్నది. సీతాదేవి మనస్సును తన కనుకూలము గాను, అభిముఖము గాను త్రిప్పుకొను ప్రయత్నమున విలాసముగా నిలుచుండి లాలన యంతయు తన యుచ్చారణ యందును ముఖాంచలములందు దీపింప మధుర వాక్యములుగా రావణుడు పలికిన పలుకు లన్నియు వాని భార్యలకు "వట్టిచాటు

6. ఛందో దర్పణము. 3-62.
7. అప్ప కవీయము. ప్రథమాశ్వాసము 27-30.

వులుగా భాసించుచున్న" వని చెప్పబడినది.[8] ఇక్కడ చాటువులనగా నేమన వలయును? నాలుక కొసతీపి మాటలనవలయును.వట్టి ఇచ్చకాలనవలయును.[9]

మరొక ప్రయోగము. "సరసకవిత్వ సంపదకు చాటువు చేరిచి మించి యెవ్వఁడా, గురువులు మువ్వురం దనిపె కోవిదుఁడా శివరాము నెన్నెదన్."[10]

మరొకటి ఘటికాశతాధిక పద్యహృద్యచోద్య రచనా విశారదుడు. కవన చతుష్క ప్రవీణుడు అయిన పోకూరి కాశీపతి గారి ప్రయోగము-"కమ నీయంబుగఁ జాటువుల్ శతకముల్ గాన ప్రబంధములీ వమలంబైన నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర[11] ..." చాటువులు శతకములు గాన ప్రబంధములు - అను నవి భిన్న భిన్నములయిన సాహిత్య ప్రక్రియలని ఇక్కడ చెప్పుకొననే వల యును.

మరియు చాటుపద్యములనగా stray verses-a current epigram -a stanza-a song or ballad-small poetry-fugitive versesa-couplets-a quatrain, a fancy-a short composition. అని బ్రౌణ్య తెలుగు నిఘంటువునందు నాలుగైదు కోణములనుండి అర్థము వ్రాయబడియున్నది.

ఇట్లు చాటు శబ్దార్థములు భిన్న భిన్నములుగా నున్నవి. అందువలన చాటుకవిత యనగా ఫలానా అని నిశ్చయముగా ననుటకు వీలుకనుపించుటలేదు.

మనము చాటువు లనుకొనుచున్న వానికి బ్రౌను పండితుని లక్షణము కొంత సమీపముగా నున్నదనవచ్చును. లాక్షణికదృష్టిని విడిచి చాటుశబ్దమును దాని రూఢ్యర్థమున గ్రహించుకొని అర్థము చెప్పు కొనవలయును. అప్పుడు

---

8. శ్రీమద్రామాయణ కల్ప వృక్షము సుందర కాండము. 103.
9. Pleasing or graceful words. *Monier Williams.* Agreeable, Sweet or coaxing speech. Flattery (Especially of a lover to his sweet heart) V. S. Apte: Witty, Pleasant, Jocular. Rambling task. C. P. BROWN.
10. శ్రీ కంభంపాటి విశ్వనాథము. గుంటూరు కాలేజీ శతావధానము. 47. కవిత్వ సంపదకు చాటువును చేర్చుట యనగా నేమనవలయును?
11. సారంగధరీయము. అవతారిక. 20.

చాటు పద్యములీక్రింది లక్షణములన్నింటితో గాక పోయినను కొన్నింటితో నైన నుండును. 1. ఆశు రచనలై యుండుట. 2. దూషణ భూషణ రూప మున నుండుట. 3. సమస్యా పూరణరూపమున నుండుట. 4. ముక్తక లక్షణ లక్షితములై యుండుట. 5. చమత్కార ప్రయోజనము కలిగియుండుట. 6. పొడుపు కథలుగా నుండుట. 7. వర్ణనగా నుండుట. 8. దైనందిన కష్ట సుఖములతోడి దినచర్యా రచనలట్లుండుట. 9. పేరడీ రచనలుగా నుండుట. 10. గాథలుగానుండుట. మరియు నిట్లు పైన చూపబడిన వివిధములుగానున్న అర్థచ్ఛాయలను గూడ అవసరమును బట్టి సంగ్రహించుకొనవచ్చును.

చాటువుల యందు సాధారణముగా కావ్య వస్తులక్షణములేని కవుల యొక్క రాగద్వేష విషయములే విషయములుగా నుండును. కొందరయందివి శాపానుగ్రహ రూపమునను ప్రత్యక్ష మగుచుండును. మిక్కిలిగా శృంగా రాత్మకముగాను, రాజ పురుష స్తోత్రాత్మకముగాను, హాస్యచమత్కారాత్మ కముగాను చాటువుండును. అందు విషయ మిదేయుండవలయునని యేమున్నది? ఏదైన నుండవచ్చును. ఎట్లైననుండవచ్చును.

సాంఘిక రాజకీయ చారిత్రకములును వ్యక్తిగతములును అయిన బహ్వంశములకు సంబంధించిన సమస్యలను పరిష్కరించుటకు నీ చాటువులెంత గానో తోడ్పడునన్న యభిప్రాయమున్నది.[13] అది నిజమే కావచ్చునుగాని ఆ సమస్యలను ఈ చాటువులు మరియు జటిలములుగా కూడ చేయుచున్నవి. కందుకూరి రుద్రకవి రాయల వారి ఆస్థానమున అష్టదిగ్గజకవులలో నొకడవునా కాదా యనుప్రశ్నమును చాటువులు పరిష్కరింప లేదు. వేములవాడ భీమకవి కాలమును నిశ్చయించుటకాయన చాటువులే అడ్డుతగులుచున్నవి. అనగా చారిత్రక సత్యములు చాటువులు కలిసిపోనప్పుడు సమస్య మరింత క్లిష్టమగును. చాటువులు చారిత్రక దృష్టితో చెప్పబడవలయునని లేదుగదా. అందువలన చాటు వులను అస్య ప్రయోజనములను సిద్ధింప జేయదలచుకొని ఉపయోగింప బోవు నప్పుడు మరింత జాగ్రత్తగా నుండవలయును.

---

13. ఒక చాటు సీసమాలిక. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి వ్యాసము. భారతి, సెప్టెంబరు-1951. గోగులపాటి కూర్మనాథకవి సింహాద్రి నారసింహ శతకము వంటిదే ఈ సీసమాలిక. "వేయుపౌజుల సంహారి! వేల్పునారి, శ్రీ మహాకాళి! శాత్రవచ్ఛేద కేళి" ఇది మకుటముకావచ్చును.

## 2. చాటువులన్నియు ఆశువులు కావు

చాటుపద్య మణిమంజరి చాటుపద్య రత్నాకరము మొదలయిన సంకలన గ్రంథములను నిదానముగా పరిశీలించినచో చాటుపద్యములన్నియు ఆశు పద్యములని చెప్పుటకు వీలులేదు. ఒకవేళ నిజముగానవి ఆశువుగానే చెప్పబడినను దేశకాలములు మారిపోయినందున అందుకు ఋజువు లిప్పుడు మనకు చిక్కవు. ఇందువలన చాటువులలో ఆశుకవితలు లేవని చెప్పుటకాదు. ఉన్నవనిచెప్పుటకు అంతఃకరణమును చూచుకొనవలయునేకాని బాహ్య ప్రమాణముల కొరకు చూచి ప్రయోజనములేదు.

సత్యవోలు భగవత్కవి దశావతార స్తవముగా రచించిన గునుగు సీసములు - జిగిబిగియును రుచియును గల 'షట్చక్రవర్తుల' పద్యములు-సాళువగుండ నరసింహరాయుల వారి పేర రచింపబడిన నవరత్న పద్యములు సప్తాంగ పద్ధతి పద్యము - మైసూరి చిక్క దేవరాయల వారి మీది పద్యములు - కందుకూరి జనార్దనాష్టకము - భృంగ పంచకము ఇత్యాదులు[14] ఆశు కవిత లగుట కవకాశము లేదు. తెలుగు పద్యములై యుండి కురవి రామకవిచేత సంస్కృతమున వ్యాఖ్యానము వ్రాయించుకొన్న ఉపదశావతారస్తుతి ఆశురచన కవకాశమిచ్చెడిదేనాః మరియును చూడవచ్చును.

"వటమూల మందిరా" యను మకుటముతో నారు పద్యములున్నవి. "రామా ః ఆర్త రక్షామణీ !" యను మకుటముతో నాలుగు పద్యములున్నవి. "అంబికా!" యను మకుటముతో నేడు పద్యములున్నవి. "దాక్షా రామ భీమేశ్వరా" - "గౌరీ మనోవల్లభా" - "శివదేవ ధీమణీ"- అను మకుటముతో నొక్కొక్క పద్యమును, "కార్తవీర్యార్జునా" యను మకుటముతో పదమూడు పద్యములును, "ఆర్తజన రక్షణోపాయ ఆంజనేయ" అను మకుటముతో నేడు పద్యములును, "నీలకంఠేశ్వరా" యను మకుటముతో పద్యములును కలవు. ఇవన్నియు చాటువులుగా గ్రంథముల కెక్కి యున్నవి.[15] కాని పరమార్థ మాలోచించినచో ఇవన్నియు నష్టములై పోయిన శతకములనియే తోచుచున్నవి. ఆ కృతులందలి అక్కడక్కడి పద్యము లానోట ఆనోట బడి కాలము మీద నెట్టు

---

14. చాటుపద్య రత్నాకరము.

15. చాటుపద్య మణిమంజరి . ద్వితీయ భాగము.

కొని వచ్చినవి. కర్తలపేర్లు కాలగర్భములో కలిసి పోయినవి. ఈ పద్యముల వల్లనే కొందరు కవుల పేర్లు నిలబడినవి కూడ. శతకములు నిదానముగా వ్రాయబడునవియే కాని ఆశువులు కావు. శతకములన్నియు ఆశువులుగానే వ్రాయబడు నన్న నియమ లక్షణము లేదు.

చాటువులుగా చలామణి యగుచున్న వానిలో దూరాన్వయాదులతోడి శ్లేషార్థములు, రహస్యార్థములు, క్లిష్టార్థములు గల పద్యములు కూడ ఉన్నవి. అందు కొన్నింటికి పూర్వులెవరో వ్రాసిన వ్యాఖ్యానములు గూడ చాటు గ్రంథములలోని కెక్కి యున్నవి. ఇటువంటివి ఆశురచనలని చెప్పుటకు వీలులేదు. యుక్తి లెక్కలను చెప్పు పద్యముల నాశువులని భావించుట కూడదు.

వండిన దెండిన దొక్కటి
ఖండించిన పచ్చిదొకటి కాలిన దొకటై
తిండికి రుచియై యుండును
ఖండితముగ దీని దెల్పు కవియుం గలడే?[16]

వక్కను - తమలపాకును - సున్నమును మనస్సున పెట్టుకొన్న కవి విషయ గోపనముచేసి చెప్పదలచినవాడు నిదానముగా నాలోచించి ఆ పద్యమును వ్రాసియుండును గాని ఆశువుగా చెప్పియుండడు. అనగా చాటువులలో ఆశువులు కానివి కూడ చేరి యున్నవని యర్థము.

గ్రంథములుగా లభించుటలేదు గనుకను, కవులెవరో కూడ తెలియవచ్చుట లేదు గనుకను, లభించినపద్యముల యందొక ఆనుపూర్వి లక్షణము లేదుగనుకను, స్తుతులుగానో నిందలుగానో ఉన్నవిగనుకను-ఆయా పద్యములు చాటువులుగా చెలామణి యగుచున్నవి. అంతేగాని అవి ఆశురచన లయినందున చాటువులని చెప్పుటకు వీలులేదు.

అట్లయినచో చాటువు లసలు ఆశువులు కాదనియే చెప్పవచ్చును కదా? చెప్పవచ్చునుగాని చెప్పకూడదు. వేములవాడ భీమకవి-శ్రీనాథుడు తెనాలి రామకృష్ణకవి-రామభద్రాంబ-రంగాజమ్మ - కూచిమంచి తిమ్మకవి మొదలయిన ప్రసిద్ధాంధ్ర భాషాకవు లాయాసందర్భముల యందాశుధారా ప్రవాహముగా

---

16. చాటుపద్య రత్నాకరము. పుట 253.

నాయా పద్యములు చెప్పినట్లు స్పష్టముగా తెలియ వచ్చుచున్నప్పుడు-అవిచాటు పద్యములని మన మనుకొనుచున్నప్పుడు చాటువులనుండి ఆశులక్షణమును తొల గించుట యెట్లు? చాటుపద్య సంకలన గ్రంథములు కలగాపులగముగా నుండక తప్పదు. అది వేరు విషయము.

## 3. చాటువులకు కర్తృత్వ మొక సమస్య

కొన్ని చాటువులు అవి నిజముగా ఎవరు ఎవరిని గురించి చెప్పినవో తెలియవచ్చుట లేదు. మరియు ఈ విధముగా పద్యములు, సన్నివేశములు కొద్ది పాటి మార్పులుండియు లేకయు అనేక మందికి సంబంధించి ప్రచారములో నున్నవి.

ఉప దశావతార స్తుతి పద్యములన్న శీర్షికను తెనాలి రామకృష్ణ కవి కృతములుగా చాటుపద్య రత్నాకరమునందున్న (పుట 27) పదునొకండు పద్యములను ఎలకూచి బాల సరస్వతీ మహోపాధ్యాయుడు రచించినట్లుగా చాటుపద్య మణిమంజరి ప్రథమభాగమున (పుట 13) నున్నవి.

తేజము సాధు వృత్తమును తేకువ గల్గిన ధీరుడెప్పుడున్
ఆజికి నిట్లనున్ పరునియాలికి నిట్లను నర్థికిట్లనున్
తేజము సాధు వృత్తమును తేకువ లేని బికారి యెప్పుడున్
ఆజికి నిట్లనున్ పరుని యాలికి నిట్లను నర్థికిట్లనున్.

ఈ పద్యము తెనాలి రామకృష్ణుని దనియు — ఈ పద్యమునకు నర్థము చెప్పుమని యడిగి ఎవరినో ఒక విద్వత్కవిని ఓడించుటకు దీనిని రామ కృష్ణుడు ప్రయోగించినాడనియు చాటుపద్య రత్నాకరము (పుట. 25) నందు న్నది. మహాదాతయైన రాయని భాస్కరుని గూర్చి చెప్పబడియున్న చాటువు లనేకములలో నొకటిగా కొద్దిపాటి మార్పులతో ఆ పద్య మీవిధముగా చాటుపద్య మణిమంజరి ప్రథమ భాగము (పుట 85) నందున్నది.

రాజిత కీర్తిశాలియగు రాయని భాస్కరు వేడఁబోవగా
నాజికినిట్లనున్ పరుని యాలికి నిట్లను నర్థికిట్లనున్
తేజము పెంపులేని యతిదీనుని హీనుని వేడఁబోవగా
నాజికి నిట్లనున్ పరుని యాలికి నిట్లను నర్థికిట్లనున్.

ఇక్కడ దీనికి కర్త ఫలానా అనిలేదు.

సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
యుర్వింజెల్లును దక్కొరు
సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే.

శ్రీనాథుడు సర్వజ్ఞసింగ భూపాలుని యాస్థానమునకు పోయి ఆ ప్రభువు నట్లు కీర్తించినట్లును తిరిగి రెడ్డిప్రభువుల యాస్థానమునకు కొండవీడురాగా వారు తమ శత్రువు నాతడట్లు స్తోత్రము చేసినందుకు కుపితులైనట్లును - అంతట శ్రీనాథు డాపద్యమునందు సర్వజ్ఞ సింగ భూపాలుని వెక్కిరించుటయే యున్నది కాని స్తుతి లేదని అన్వయము చెప్పి రెడ్డి ప్రభులను సంతోష పెట్టినట్లును ప్రసిద్ధముగా కలదు.[17] సరిగా ఇటువంటి కథయే నక్కలపాటి సంజీవరాయనిగురించి కూడ కలదు. "మట్లె అనంత భూపాలున కీయన ఆశ్రితుడు. మట్లె వెంకట రామరాజు గారికిని వేమల వేంకటరామరాజుగారికిని బద్ధ వైరము. సంజీవరాయ కవి వేమల వారికడకు పోయి

స్వామి ! వినుమట్లె వేంక
ట్రామక్ష్మాజాని నీదు రణజయభేరీ
ధామ ధ్వని వెనుజరగడె ?
వేమల చిన బసవరాయ వేంకట నృపతీ.

అని పద్యమును చెప్పగా, అతడు తన విరోధిని తగ్గించి, అతని యాస్థాన కవి తన్నుగ్గించినందుకు మిక్కిలి సంతోషించి కవిని గొప్పగా సత్కరించి పంపెను. ఆ కథ విని మట్లెవారు "ఏమయ్యా మా విరోధిని పొగడి వానికడ మమ్ము నిరసించితివా" అని యడుగగా, కవి "లేదు ప్రభూ! నేనట్లు చేయుదునా? —" మట్లె వేంకట్రామక్ష్మాజాని! నీదు రణ జయభేరీ ధామ ధ్వనిన్ (ధ్వనిచేత) వేమల... వేంకట నృపతి వెనుజరగడె? అని ఆ పద్యమునకర్థము. అతడీ యర్థమును గుర్తింపలేక తన్ను పొగడినట్లనుకొన్నాడు" అని చెప్పగా మట్లె వారు హర్షించి కవిని బహూకరించిరట.[18]

17. శృంగార శ్రీనాథము. పుట. 213.
18. చాటుపద్య రత్నాకరము. పుట. 54.

అడిదము సూరకవిని ప్రశంసించుచు కొ్ౕరటి బాలకవి చెప్పినట్లు చాటు పద్య రత్నాకరము నందున్న పద్యములు (పుట 85) చాటుపద్య మణిమంజరి ద్వితీయ భాగమునందు (పుట 138) ఎవరో భట్టుకవి చెప్పినవన్నట్లున్నవి.

విజయ రాఘవ నాయకుని యాస్థాన కవయిత్రియు మరియు నాయన కానందకారియునైన రంగాజమ్మ పట్టమహిషికి ఆ వచ్చిన దూతిక ద్వారా చెప్పి పంపిన జవాబు.

ఏ వనితల్ మముం దలప నేమిపనో ? తమరాడువారు గా
రో ! వలపించు నేర్పెరుఁగరో? తమ కౌగిటిలోన నుండగా
రావది నేమిరా విజయ రాఘవ యంచిలుదూరి బల్మిచే
తీవరకత్తెనై యిటుల తీసుక వచ్చితినా తలోదరీ!

మరియు తదితరములయిన పద్యములు ఆడిదము సూరకవి విజయ రామ రాజును గురించి వ్రాసినవని గురజాడ శ్రీరామమూర్తి పంతులు గారు వ్రాసినారు.[19]

## 4. చాటుకవులు

### 1. వేములవాడ భీమకవి :

నిజముగా చాటు పద్యములన్నవి ఆశువుగా చెప్పబడినవి వేములవాడ భీమకవి నాటి నుండియు కలవు. చాల వరకు కాలగర్భమున కలిసి పోయినవి. చాటువుల వల్లనే భీమకవి అంతటి వాడని మనమిప్పు డనుకొనగలుగుచున్నాము. తన మహనీయ శక్తి యిట్టిదని ఆయనయే చెప్పుకొన్నాడు.

గడియలోపలఁ దాడి గడఁగి ముత్తునియగాఁ
దిట్టిన మేధావి భట్టుకంటె
రెండు గడెల బ్రహ్మదండి ముండ్లన్నియు
డుల్లఁదిట్టిన కవిమల్లుకంటె
మూఁడు గడెలకుఁ దామెనసి యత్తిన గండి
పగులఁ దిట్టిన కవిభాను కంటె

19. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము. పుట. 159.

అఱజాము లోపలఁ జెఱువు నీళ్ళింకంగఁ
దిట్టిన బడబాగ్ని భట్టు కంటె
నుగ్రకోపి నేను నోపుదు శపియింపఁ
గ్రమ్మరింప శక్తి గలదు నాకు
వట్టి మ్రానఁజిగురుఁ బుట్టింప గిట్టింప
బిరుదు వేములవాడ భీమకవిని.

ఈ వేములవాడ భీమ కవికి ఎందుకో తెలియదు గాని ఆ యూరి కోమటి శెట్టి గారి మీద గట్టిగా కోపము వచ్చినది. ఎన్ని పద్యములతో తిట్టినాడో ఏమో గాని రెండుపద్యములు మాత్రము లభించినవి.

గొనకొని మర్త్య లోకమునఁ గోమటి పుట్టఁగఁదోడఁ బుట్టె బొం
కును కపటంబు లాలనయు కుత్సితబుద్ధియు రిక్తభక్తియున్
చనవరి మాటలున్ పరధనంబును గ్రక్కున మెక్కఁ జూచుటల్
కొనుటయు నమ్ముటల్, మిగుల గొంటుతనంబును మూర్ఖవాదముల్.

కోమటి కొక్కటిచ్చి బదిగొన్నను దోసము లేద యింటికిన్
సేమమెఱింగి చిచ్చిడిన చెందదు పాపము వాని నెప్పుడేన్
ఏమఱుపాటునన్ మరియు నేమి యొనర్చిన లేదు దోస - మా
భీముని లింగమాన కవి భీముని పల్కులు నమ్మియుండుడీ ?

ఈ పద్యాలు ప్రచారము కాగా మరొక కవి విని ఆ కోమటి మీద తనకును కోప ముండియు ఏమియు అనలేక ఇంత కాలమును ఉన్నవాడు ధైర్యము తెచ్చుకొని తన పక్షముగా భీమకవి మాటాడుచున్నాడు గదా యన్న ఉత్సాహముతో నొక పద్యమును చెప్పెను.

వేములవాడ భీమ! భళిరే! కవిసన్నుత ! పద్యమందు నీ
వేమని చెప్పినాడ వొక యించుక కోమటి పక్షపాతివై
కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసములేదటందురా?
కోమటి కొక్కటీక పదిగొన్నను దోసము లేదు లేశమున్,

వేములవాడ భీమకవికి శాపానుగ్రహ సమర్థమైన వశ్య వాక్కు కలదని ప్రసిద్ధి యున్నది. చాళుక్య చొక్క భూపాలుని కోరిక మేరకు మల్లెసాలనున్న స్తంభమును పుష్పఫలభరిత వృక్షముగా చేయుటకు భీమకవి చెప్పినపద్యము.[20]

"ఆనీతాభ్యుపదాన శృంఖల కరాభ్యాలంబిత స్తంభమా?
నేనే వేములవాడ భీమకవినేనిన్ చిత్రకూటంబులో
భూనవ్యాపృత పల్లవోపలతికా పుష్పోప గుచ్ఛంబులన్
నానా పుష్ప ఫల ప్రదాయి వగుమా యాకల్పవృక్షాకృతిన్.

అట్లే యా స్తంభమప్పటికప్పుడు పుష్పఫల భరిత మగు వృక్షమువలె నయ్యెనట. అట్లు ప్రత్యక్షముగా తన వాక్సిద్ధి లక్షణమును ప్రదర్శించి ఆ వృక్షమును తిరిగి స్తంభముగా చేయుటకు భీమకవి ఈ క్రింది పద్యమును చెప్పెను.

"శంభు వర ప్రసాది కవిజాలవరేణ్యుఁడనైన నావచో
గుంభన మాలకించి యనుకూలత నొంది తనూనభావసన్
గుంభిని చొక్క నామ నృపకుంజరు పందిటి మల్లెసాలకున్
స్తంభము రీతి నీ తనువు దాలిచి యెప్పటి యట్లు యుండుమా."

ఆ సందర్భమున యందీ రెండు పద్యములును ఆశురచనలుగా చెప్పబడినట్లు స్పష్టమగుచునే యున్నది.

కళింగ గంగును శపించి రాజ్యభ్రష్టు గావించినట్లును ఆ పిమ్మట అనుగ్రహమున ఆశీర్వదించి వానికి తిరిగి రాజ్య లాభమును కలిగించినట్లును ప్రసిద్ధముగా నున్న కథయే వేములవాడ భీమకవి నింతవాడుగా నిలబెట్టుకొనుచు వచ్చుచున్నది.

వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగ గంగు తా
సామముమాని కోపమున సందడి దీఱిన రమ్ము పొమ్మనెన్
మోమును జూడ దోషమిక ముప్పది రెండు దినంబులావలన్
జామున కర్థ మందతని సంపద శత్రుల పాలు గావుతన్.

ఇది శపించిన పద్యము. మొదటి రెండు పాదములలో శాప హేతువున్నది. భీమకవి నాతడు మన్నన చేయ లేదు. ఆ పిమ్మట శాపము ననుభవించుచు

20. చాటుపద్య మణి మంజరి. ప్రథమభాగము 113.

కళింగ గంగు భీమకవిని చూచి క్షమించి రక్షింపవేడుకొనగా ప్రసన్నుడై ఈ క్రింది పద్యమును చెప్పెను.

వేయిగజంబులుండ పదివేలు తురంగములుండ నాజిలో
రాయల గెల్చి సజ్జ నగరంబున పట్టముగట్టుకోవడిన్
రాయ కళింగ గంగు ! కవిరాజ భయంకరమూర్తిఁ జూడగా
బోయెను మీన మాసమున పున్నమ పోయిన షష్ఠినాటికిన్.

ఆ విధముగానే కళింగ గంగు తిరిగి రాజ్యమును పొందెను.

రాము నమోఘబాణమును, రాజశిఖామణి కంటిమంటయున్
భీముగదావిజృంభణ, మురుపేంద్రుని వజ్రము, చక్రి చక్రము॥
తామరచూలి వ్రాతయును, తారకవిద్విషు ఘోరశక్తియున్
వేములవాడ భీమకవి పీరుని తిట్టును రిత్తవోవునే ?

ఇది భీమకవి స్వరూప జ్ఞానముతోడి ఆత్మ విశ్వాసము. ఏ మహాకావ్యములు వ్రాయకుండగనే ఆయన నాయన చాటువులే నిలబెట్టుట పరమాశ్చర్యకరమైన విషయము. వ్రాసినను అవి నిలబడలేదు కదా!

## 2. శ్రీ నా థు డు :

సర్వాంధ్ర కవులలోను చాటు పద్యములెక్కువగా చెప్పినకవి శ్రీనాథుడనియే చెప్పవలెను. దేశ సంచారము చేయవలసి వచ్చుటయే అతని జీవితములో చాటు రచనలకు ప్రేరకమైనది. శ్రీనాథుడు కర్ణాట ప్రభునాస్థానమునకు పోయి డిండిమభట్టునోడించి కనకాభిషేకమును చేయించుకొన్న చారిత్రక సత్యమును వాని చాటువులే చాటుచున్నవి.[21] వెంటనే ప్రభువు దర్శనముకాలేదు. కొన్నాళ్లు శ్రీ నాథుడక్కడనే పడియున్నాడు. అప్పటి యాక్రోశమును చాటుచున్న పద్యము.

కుల్లాయుంచితి కోకజుట్టితి మహాకూర్పాసమున్ దొడితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపగా
చల్లా? అంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచుబోనాడితిన్
తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా! నేను శ్రీనాథుడన్.

21. శృంగార శ్రీనాథము. పుట. 184.

శ్రీనాథుడు రాయల వారికి వ్రాసి పంపిన పద్యము

డంబుసూపి ధరాతలంబుపై తిరుగాడు
కవి మీదగాని నా కవచమేయ
దుష్ప్రయోగంబుల దొరకొని చెప్పెడు
కవి శిరస్సునగాని కాలుచాప
సంగీత సాహిత్య సరస విద్యల నేర్చు
కవుల బొమ్మలు గాని కాల్చి విడువ
చదివి చెప్పగ నేర్చి సభయందు విలసిల్లు
కవినోరుగాని వ్రక్కలుగ దన్న
దంట కవులకు బలువైన యింటి మగడ
కవుల వాదంబు విను వేడ్కగల్గెనేని
నన్ను బిలిపింపు మాస్థాన సన్నిధికిని
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!

డిండిమభట్టునోడించిన తరువాత కనకాభిషేక సత్కారమును పొంది తననట్లు గౌరవించిన ప్రభువును ప్రశంసించుట కిట్లుపక్రమించి శ్రీ శారదాదేవిని తన యందు మేల్కొల్పుకొనినాడు.

జోటీ! భారతి! యార్భటిన్ మెఱయుమీ చోద్యంబుగా నేను క
ర్ణాటాధీశ్వరు దేవరాయనృపతిన్ నాసీర ధాటీచమూ
కోటీ ఘోటక ధట్టికా ఖురపుటీ కుట్టాక సంఘట్టన
స్ఫోటీ ధూతధరారజశ్చ్ఛికాతాంభోటిన్ ప్రశంసించెదన్.

మరియు శ్రీనాథుడు తాను తిరిగిన తావులయందు తనను కష్టసుఖముల రూపమున స్పందింప జేసిన సన్నివేశములనెల్లను చాటువుల యందు నిబద్ధము చేసెను. ఆయన కదియొక అలవాటు. శ్రీనాథుని పలనాటి సంచారము చాల ప్రసిద్ధమైనది[22].

---

22. చాటుపద్య మణిమంజరి. ప్రథమ భాగము పుట. 125.

చిన్న చిన్న రాళ్లు చిల్లరదేవుళ్లు
నాగులేటి నీళ్లు నాపరాళ్లు.
సజ్జజొన్న కూళ్లు సర్పంబులును తేళ్లు
పల్లనాటిసీమ పల్లెటూళ్లు.

అందు నెమలిపురిని గూర్చినది

నెమలిపురి యమపురముగా
యముడాయెను బసివి రెడ్డి యంతకు మిగులన్
యమదూతలైరి కాపులు
క్రమ మెఱుగని దుష్టులైరి కరణా లెల్లన్.

ఒయ్యారములు పోయెడు వయసుకత్తెను చూచి చెప్పినది.

సొగసు కీల్జడదాన సోగకన్నులదాన
వజ్రాలవంటి పల్వరుసదాన
బంగారు జిగిదాన పటువుగుబ్బలదాన
నయమైన యొయ్యారి నడల దాన
తోరంపుకటిదాన తొడల నిగ్గుల దాన
పిడికిట నడగు నెన్నడుము దాన
తళుకు చెక్కుల దాన బెళుకు ముక్కరదాన
సింగాణి కనుబొమ చెలువు దాన
మేలిమి పసిండి రవకడియాల దాన
మించిపోనేల రత్నాల మించుదాన
తిరిగి చూడవె ముత్యాల సరుల దాన
చేరి మాటాడు చెంగావిచీరదాన.

ఈ విధమైన బజారు శృంగారపు పద్యములు చాల శ్రీనాథునివిగా చెప్పబడుచు ప్రచారము నందున్నవి. స్వభావ రమణీయమైన దృశ్యమును వర్ణించెడు పద్యము–

పువ్వులు కొప్పునం దురిమి పొందుగ కౌనసియాడుచుండగా
చివ్వున పంగసాచి యొక చేతను రోకలి పూని యొయ్యనన్
నవ్వు ముఖంబుతోడ యదు నందను బాడుచు నాథుజూచుచున్
సువ్వియ సువ్వియంచు నొక సుందరి బియ్యము దంచె ముంగిటన్.

మరొక్కటి — రెండు.

తాటంకయుగ ధగ ద్ధగిత కాంతిచ్ఛటల్
చెక్కుటద్దములపై జీరువార
నిటలేందు హరినీల కుటిల కుంతలములు
చిన్నారి మోమున చిందు ద్రొక్క
బంధుర మౌక్తిక ప్రకటహారావళుల్
గుబ్బ చన్నుల మీద గునిసి యాడ
కరకంకణ క్వణ క్వణ నిక్వణంబులు
పరుమాఱు రాతిపై పరిఢవిల్ల
ఓరచూపుల పిటచి త్త మూగులాడ
బాహుకుశలతఁ జక్కని మోహనాంగి
పాటపాడుచు కూర్చుండి రోటిమీద
పిండి రుబ్బంగ కన్నుల పండువయ్యె.

శ్రీరస్తు భవదంఘ్రి చికురంబులకు మహా
భూర్యబ్దములు సితాంభోజనయన !
వరకాంతిరస్తు తావకముఖనఖముల
కాచంద్ర తారకం బబ్జవదన !
మహిమాస్తు నీకటి మధ్యంబులకు మన్ను
మిన్నుగలన్నాళ్ళు మించుబోడి
విజయోస్తు నీ గాన వీక్షల కానీల
కంఠహరిస్థాయిగా లతాంగి
కుశలమస్తు లసచ్చాత కుంభకుంభ
జంభభిత్కుంభి కుంభాభిజృంభమాణ
భూరి భవదీయ వక్షోజములకు మేరు
మందరము లుండు పర్యంత మిందువదన !

శ్రీనాథునివని చెప్పబడుచున్నవి యిన్ని చాటువులు ప్రచారము నందున్నను అవి యన్నియు శ్రీనాథ విరచితములని విద్వాంసు లంగీకరించుటలేదు. ఎవరేపద్యము రచించినను నది శృంగార పరమైనచో శ్రీనాథునకును, హాస్య పరమైనచో తెనాలి రామకృష్ణునకును, వేదాంత పరమైనచో వేమనకును సంట

గట్టు చుండుట లోకములో పరిపాటియైనదనియు, శ్రీనాథునివని తలంచెడు పద్యములలో తురగా రామకవికి వలెనే ఇంకెందరో రచయితలు కలరనియు ఇంతకును నీ చాటుపద్యముల వలన నయ్యేడు ప్రయోజనము లేదనియు, వారభిప్రాయ పడుచున్నారు.[23]

3. అల్లసాని పెద్దన :

శ్రీ కృష్ణదేవరాయలవారి నిర్యాణానంతరం కొన్ని సంవత్సరములు పెద్దనామాత్యుడు జీవించి యుండి తన ప్రభువును తలచుకొనుచు లోపల లోపల అనుభవించిన దుఃఖమునకు ప్రతీకగా ఈ క్రింది చాటు పద్యము నిలిచియున్నది.

ఎదురైనచో తన మదకరీంద్రము నిల్పి
కేలూత యొసగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొనువేళ పురమేగ
పల్లకి తనకేల బట్టియెత్తె
గోకట గ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగిన సీమలయందు నిచ్చె
బిరుదైన కవి గండపెండేరమున కీవ
తగుదని తానె పాదమునఁదొడిగె
ఆంధ్ర కవితా పితామహ! అల్లసాని
పెద్దన కవీంద్ర! యని నన్ను బిల్చినట్టి
కృష్ణరాయలతో దివికేగలేక
బ్రతికి యున్నాడ జీవచ్ఛవంబనగుచు.

రాయల వారి మరణానంతరము గజపతిరాజు కన్నడరాజ్యమును సులభముగా నాక్రమింప వచ్చునని దండెత్తి వచ్చుచున్నాడని తెలిసి-పెద్దనామాత్యుడు వానికొక సీసపద్యమును వ్రాసి పంపెను.

రాయ రాహుత మిండరాచ యేనుగు వచ్చి
యారట్ల కోట గోరాడు నాడు
సంపెట నరపాల సార్వభౌముడు వచ్చి
సింహాద్రి జయశిల జేర్చునాడు

23. ఆంధ్ర కవి తరంగిణి. అయిదవ సంపుటము. 170, 71

సెలగోలు సింహంబు చేరి ధిక్కృతి కంచు
తల్పుల కరుల డీకొల్పునాడు
ఘనతర నిర్భర గండ పెండెరమిచ్చి
కూతు రాయలకొనగూర్చునాడు
ఒడలెఱుంగవొ? చచ్చితొ? యుర్విలేవొ?
చేరజాలక తలచెడి జీర్ణమైతొ
కన్నడం బెట్లు సొచ్చెదు గజపతీంద్ర
తెలిచినిలు కుక్క సొచ్చిన తెఱగు దోప.

ఈ పద్యమును చదువుకొని గజపతిరాజు తనను చూచుకొని తానే సిగ్గుపడి వెను దిరిగి పోయెనని చెప్పుదురు. చారిత్రక విషయాధారములయినపద్యము లివ్వి.[24]

**4. తెనాలి రామకృష్ణుడు :**

ఓయమ్మలార మందులు
వేయేల మకారకొమ్ము విషకవిగానిన్
వాయెత్త కుండ జేసిన
వాయెత్తదు రామరాయ వసుధేశునకున్.

ఈ పద్యము అళియ రామరాయలకు వాయురోగమురాగా ఆమందులా ఈమందులాయని అంతఃపురమున వారనుకొనగా రామకృష్ణుడు చెప్పినదని చెప్పుచున్నారు. మకారకొమ్ము విషకవియనగా మూర్తికవి. భట్టుమూర్తి కావలయును. వానినోరు మూయించుటయే రాయల వారి రోగమునకు మందని యనుట. చారిత్రక సమస్యలతో కూడుకొన్న పద్యమిది. ఇట్లు భట్టుమూర్తి నాక్షేపించుచునట్లున్నదే మరొక పద్యము.

కెంగేల రామకృష్ణుని
బంగరు కడియంబులుండ పండితుడగునా ?
జంగులు జల్లులు గల్గిన
సింగారపుటూరకుక్క సింగంబగునా ?

---

24. చాటుపద్య మణిమంజరి. ప్రథమ భాగము. 161.162

మరొక శృంగార కవిత. తప్పించుకొని పోవుచున్న వయసుకత్తి నొకర్తుక నుద్దేశించినదిగా నున్నది.

వరబింబాధరమున్ పయోధరములున్ వక్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు జూపకవ్వలి మొగం బైనంతనేమాయెః నీ
గురు భాస్వజ్జఘనంబు క్రొమ్ముడియు మాకుంజాలవేః గంగ క
ద్దరి మేలిద్దరి కీడునుంగలవె యుద్యద్రాజ బింబాననా!

రామకృష్ణని వనబడు చాటువులలో పెద్దనామాత్యుని ఆక్షేపించుచున్న ఈ పద్య మును ప్రసిద్ధమైనదే—

ఎమితిని సెపితివి కపితము
బ్రమపడి వెఱిపుచ్చకాయ వడిదిని సెపితో
యుమెతకయతిని సెపితివో
యమవసనిసి యనెడిమాట యలసని పెదనాః

అమావాస్యా - నిశా యనుపదములను కుదిమట్టముచేసి అమవసనిసి అని పెద్దన చేసిన సమాసమును ఆక్షేపించుచు చెప్పిన పద్యముకదా - అందుకని రామ కృష్ణుడు తానును ఆయా పదరూపములను లఘుమయము చేసి చమత్కారము చేసినాడు.

## 5. కూచిమంచి తిమ్మకవి :

శృంగార ఘట్టమునందలి వొకచాటువు పరమ రమణీయమైనది కూచిమంచి తిమ్మ కవికి సంబంధించినది కలదు. ఆయన "రసికజన మనోభిరామము" అను కావ్యమును రచించెను. దాని నొక చక్కని రసికురాలయిన వయస్సులో నున్న వేశ్య చదివి ఆ కావ్యమును రచించిన కవియొక్క మహారసికతను భావిం చుటయే పనిగా భావించినది. ఆమెయును కవయిత్రియే. [కూచిమంచి తిమ్మన్న గారంత అందగాడు కాకపోవుటయే కాక నల్లగా సాలగ్రామమువలె పొట్టిగా, లావుగా, మొరటుగా నుండెడి వాడు. ఆ వేశ్య మనసులో తిమ్మకవి చాల సొగ సైనవాడు.] ఆ వీథిన బడి తిమ్మకవి యొకనాడు పోవుచుండగా అతడే తిమ్మ కవియని యెవరో ఆ వేశ్యకు చెప్పిరి. అది తన్మయత్వముచెంది పరుగు పరు గున బోయి ఆ వీథిలో వానిని కౌగిలించుకొనెను. ఆయన తాదృశమైన హఠా త్సంభవమునకు నివ్వెరపడి మొగము త్రిప్పుకొనెను. అప్పుడావేశ్య అన్నది.

"చతురులలోన నీవు కడు జాణ వటంచును నేను కౌగిలించితి నిటు మాఱుమో మిడగ జెల్లునే?"— అని.

ఆ పద్యమునట్లే కొనసాగించుచు సమాధానముగా తిమ్మ కవి యిటుల చెప్పెను.

"ఓ రసికాగ్రగణ్య ! యద్భుత మగునట్టి బంగరపు బొంగరపుంగవ బోలు నీ కుచ ద్వితయము జొమ్మునాటి చని వీపున తోచెనొ యంచు జూచితిన్."

## 6. అడిదము సూరకవి :

శాఖా భేదములతో బ్రాహ్మణులు పరస్పరము కలహించుకొనుట అడిదము సూరకవి కాలముననే మొదలయినదను ఒకానొక సాంఘిక విషయమునకు నిదర్శనముగా చాటువులున్నవి. పదునెనిమిదవ శతాబ్దమున విజయనగర సంస్థానమును బట్టుకొని అడిదము సూరకవి యున్నాడు. రేకపల్లి సోమనాథకవి కూడ ఉన్నాడు. అయన నియోగి. ఈయన వైదికి. సత్యవరము కాకర్ల గోపాలరాయ పాయకరావుగారి కాశ్రితుడు. ఒకసారి సోమనాథకవి విజయ నగర ప్రభువులను దర్శించి సన్మానమునుపొంది ఇంటికి పోవుచుండగా కోట వాకిట నొక భట్టుకవి సోమకవినిట్లు స్తుతించినాడు.

అప్పా! రేకపలీ సో
మప్పా! విబుధాళి పాళియమృతపులప్పా!
ఒప్పులు నీ కవితలు వె
న్నప్పాలకు సాటివచ్చునౌ బళి! రుచులన్.

ఈ స్తుతికా వైదికపు బ్రాహ్మణుడు పొంగిపోయి రాజుగారు తనకొనర్చిన సన్మానమునా భట్టునకిచ్చి బహూకరించినాడు. ఆ విషయము తెలిసి మహారాజు గారు సోమనాథకవిని పిలిపించి మిక్కిలిగా సన్మానించినాడు. ఇదంతయు ఆస్థానకవియైన అడిదము సూరకవిగారి కసహ్యమైనది. ప్రతివాడును నేనొక కవినని బయలు దేరుచున్నాడన్న యభిప్రాయము నాయన ఇట్లు వ్యక్తము చేసినాడు.

దేవునాస మున్ను దేశానికొక కవి
యిప్పు డూర నూర నింట నింట
నేగురార్గు రేడ్గు రెనమండ్రు తొమ్మండ్రు
పదుగురేసి కవులు పద్మనాభ.

ఇంతటితో నాగక సోమనాథ కవిని తిరస్కరించుటకు సూరకవి వాని బ్రాహ్మణ శాఖను పట్టుకొనినాడు. వాని కవిత్వము కవిత్వము కాకపోవుట కదియే హేతువన్న నిశ్చయమునకు కూడ వచ్చినాడు.

చెన్నగు నియోగి కవనము
మిన్నక వైదికున కబ్బ మిగులునె చెపుడీ!
జున్ను రుచి వెన్న కబ్బునె
తన్నక చచ్చిననుగాని ధరలో నరయన్.

ఈ మాటలు విని సోమనాథ కవి మాత్రమెటుల సహించి యూరకుండ గలడు?

త్యాగము విక్రమంబు సుకృతంబు నిగర్వము నీతి బంధు సం
యోగము పెత్తనంబు వినియోగ మెఱింగి చరింప నేర్చు ని
య్యోగులు రాజయోగులు కుయుక్తుల మాయల విఱ్ఱవీగు ని
య్యోగు లనాథయోగు లవయోగులు నోగులు జోగులెన్నగన్.

ఈ నియోగి వైదిక భేదంబులతోడి కలహములు కవులయందు తిరుపతి వేంకట కవుల కాలమువరకు సాగినవి. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి చాటు వొకటి ఈ సందర్భమునకు ఋజువుగానున్నది.

చందన శాఖికన్న విరసంబగు బూరుగు మేలటన్న తీ
విందగినట్లు వైదిక కవిత్వ సుధారసధారలెల్ల చె
ల్వొందగ భూతలంబున నియోగి కవిత్వము తోడ సాటిరా
వందురు బెట్టిదం బగునటందురు కొందరు మూఢమానవుల్.

అడిదము సూరకవి కవిత్వము తనదానికంటె మేలుగా నున్నట్లు రేకపల్లి సోమనాథ కవికి లోపల తెలియును. ఆయన తనలోపలి యభిప్రాయము నొక చాటువునందు వ్యక్తము చేసినాడు.

ఇలలో వైదిక విద్వ
త్తిలకంబుల కేమిదిక్కు దెలిపితివమ్మా
జిలి బిలి పలుకుల వెలదీ
పలుగాకి నకారగుళ్ళ పాలై తిగదే!

నకారగుళ్ళనగా నియోగులు.

**7. వేమూరి సీతారామ శాస్త్రి :**

రాగము పీడుకొన్న యతిరాజుల మానసవృత్తికిన్ కడున్
రాగము గూర్చె నీధయిన రాగము వేరె నుతింప నేల ఆ
త్యాగయ నీవయై మరల ధాత్రి జనింపగబోలు గీతికా
సాగరుడీవు నిన్ పొగడ శక్యమె శ్రీహరి నాగభూషణా!

సరిగమ సానిసారి పమసానిససా యను టుజ్జగించి ఆ
స్వరపదమందు తీర్థమును స్వార్థము గూరుచు రామనామమున్
తరుచుగ పాడి శ్లోకముల తత్పరతన్ పఠియించి గీతికిన్
కరమరుదైన క్రొత్త గతి కల్పన చేసి కరంచితేమమున్.[25]

ఈ రెండు పద్యములను శ్రీ వేమూరి సీతారామ శాస్త్రిగారు శ్రీహరి నాగభూషణం గారి గానకచ్చేరి అయిన సందర్భమున ముక్త్యాలలో ఆశువుగా చెప్పినవి. శ్రీ సచ్చిదానంద స్వాములవారు రాజావారి ఆతిథ్యములో చాతుర్మాస్య దీక్షను నిర్వహించినప్పుడు నాగభూషణంగారి కచ్చేరి కవిపండితుల సమక్షమున జరిగినది. శ్రీ సచ్చిదానందు లాగానమునకు లేచి నృత్యము చేసినారట. ఆసందర్భమున సీతారామ శాస్త్రిగారా పద్యములను చెప్పిరి. "రాగము పీడుకొన్న యతిరాజు" లన్నదాని కథయది. రెండవ పద్యమున మరొక రహస్యమున్నది. శ్రీహరి నాగభూషణంగారి గాన కచ్చేరిలో ప్రత్యేకత యేమనగా ఆయన అందరివలె సరిగమ పదనిసలతో స్వరము వేయక రామ రామ రామ-అని రామ నామస్మరణముతో స్వరము వేసెడివారట. ఆ విషయమును సీతారామ శాస్త్రిగారు రెండవ పద్యమున నమోదు చేసినారు. ఈ విధముగా

25. ఆంధ్రప్రభ. 25, ఫిబ్రవరి.

చాటువులు ఆయా కాలములందలి కొన్ని కొన్ని విశేషములను రహస్యములను ఇముడ్చుకొని యుండును.

**8. వనమా వేంకట రమణగుప్త :**

ఈ యొక రెండు కావ్యముల నీ తెనుగుంబ్రజ జన్మజన్మముల్
ధ్యేయమొనర్చియున్ ఋణము తీర్చగ శక్తముగాదు భారతా
మ్నాయము పూర్వ కావ్యముల నవ్యకవీంద్ర కృతమ్ములందు రా
మాయణ కల్పవృక్ష మధరాధరి తాంధ్రమహా మహీస్థలిన్.

ఇది శ్రీ మద్రామాయణ కల్పవృక్షమును గూర్చిన చాటువు. దీనిని చెప్పినకవి కీర్తిశేషులు విద్వాన్ వనమా వేంకటరమణ గుప్తగారు. ఇప్పటికి దాదాపిరువది సంవత్సరాల క్రితము గుంటూరు జిల్లా సత్తెనపల్లి హైందవోన్నత పాఠశాల ఉపాధ్యాయుల మధ్యవచ్చిన సాహిత్య గోష్ఠి వివాదములో శ్రీ గుప్తగారువ్వెత్తు గాలేచి ఈ పద్యముతో విజయ దుందుభిని మ్రోగించి తోటివారిని దిగ్భ్రాంతులను గావించినారు. ఈ వ్యాసకర్తకూడ ఆగోష్ఠిలో నొకడుగా నున్నాడు.

ఎదకు పురాంధ్ర సంస్కృత కవీశ్వర భారతి దీప్తికల్గినన్
సదమల బుద్ధికిన్ బహుళశాస్త్ర రహస్య వివేకమబ్బినన్
మదికి ఉదాత్త కల్పనల మక్కువ కల్గిన విశ్వనాథ శా
రద సకలార్థ దాయిని సురద్రుమవు రామకథన్ భజింపుడీ.

ఇది మరొకరు చెప్పినది.

## 5. చాటు భేదములు

**1. పేరడి చాటువులు :**

లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెరుగ మన్నింపదగున్ దీనునిన్
రావేయీశ్వరః కావవే వరదః సంరక్షింపు భద్రాత్మకాః

ఈ పోతన్నగారి పద్యమునకెవరో అజ్ఞాత కవి వ్రాసిన పేరడీ చాటువు—

పూవిల్కాని సరోజబాణముల నంభోజారి మైచాయలన్
భావంబెంతయు డస్సె మేనుబడలెన్ తాపంబురెట్టించె నే
నీవాడన్ మధురాధరంబొసగవే! నిక్కంబునన్నేలవే!
రావే మానిని! కావవే తరుణి! సంరక్షింపు చంద్రాననా!

ఆధునిక కాలమున ఈ పేరడీ చాటు పద్య రచనా విధానమును చక్కగా సాధనచేసిన కవులు నలుగురైదుగురున్నారు. చాటు శబ్దమును తీసివేసి పేరడీ లనియే వ్యవహరించుటచేత నదియొక అతినవ్య కవితా ప్రక్రియగా చెలామణి యగుచున్నది.[26] జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారికి పేరడీ శాస్త్రిలనియే పేరన్నచో ఆరచనయందెంత సిద్ధహస్తుడో భావింపవచ్చును. మరియు శ్రీశ్రీ, మాచిరాజు దేవీప్రసాదుగారలును మంచి పేరడీలను రచించినారు.

అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడతెగక పారునేరును ద్విజుడున్
చొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ!

దీనికి శ్రీశ్రీ వ్రాసిన పేరడీ చాటువు

ఎప్పుడు పడితే అప్పుడు
కప్పెడు కాఫీ నొసంగ గలిగిన సుజనుల్
చొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టి యూరు చొరకుము ముప్పా![27]

ఏదేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం

26. ఆధునికాంధ్ర కవిత్వము. 669.
27. మూడు యాభయిలు. 7.

నరజాతి చరిత్ర సమస్తం
పరస్పరాహరణోద్యోగం
నరజాతి చరిత్ర సమస్తం
రణరక్త ప్రవాహ సిక్తం.[28]

ప్రసిద్ధమైన శ్రీ.శ్రీ. గారి కవితకు శ్రీ మాచిరాజు దేవీప్రసాద్‌గారు రచించిన పేరడీ చాటువు.

ఏరోడ్డు చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
రహదారీ చరిత్ర సమస్తం
ధూళిధూసర పరిన్యస్తం

రహదారీ చరిత్ర సమస్తం
యాతాయాత జనసంయుక్తం.
రహదారీ చరిత్ర సమస్తం
పథిక వాహన ప్రయాణసిక్తం![29]

## 2. గాథా చాటువులు :

ఆధునిక కాలమున శాలివాహన సప్తశతినమూనాలో రచించిన కవిత లున్నవి. అవన్నియు చాటు లక్షణ లక్షితములే.[30] విశ్వనాథ పంచశతి - దేవుల పల్లి కృష్ణశాస్త్రిగారి "విశ్వదాభిరామ వినురవేమ" పద్యాలు - శ్రీశ్రీ గారి "సిరిసిరిమువ్వ" పద్యాలు - కొమరవోలు వేంకట సుబ్బారావుగారి "చెకుముకి రవ్వా" పద్యాలు - "వాస్తవమ్ము నార్లవారి మాట" పద్యాలు - పైడి పాటి వారి శత పత్రము మొదలయినవన్నియు గాథా చాటు కావ్యములు. ఒక కవిచేత ఒక ప్రయోజనము నాశించి ఒక పద్ధతిలో ప్రయత్నపూర్వకముగా వ్రాయబడిన సమాజముయొక్క వేయిముఖములను దేనికదిగా చిత్రించెడి పద్యములు కదా

28. మహాప్రస్థానం. 70.
29. రహదార్లు. భారతి. ఫిబ్రవరి 1949
30. శతకాలూ - ముక్తకాలూ. వ్యాసము. భారతి. మే. 1963.

అవన్నియును: ఒక్కొక్క అనుభవము మీద ఒక్కొక్క పద్యమునుగనుక అవన్నియు గాథలే. గాథలన్నియును చాటువులే.

"అతనికేమొ కాపింగు లేదంచువంక
వీడు ఐయ్యేయ్యె పరీక్ష తప్పెనని సబురు
పాయ బలికెడు నెన్నొ సంబంధములను
అంగజున కామె యేకు మేకయ్యె తుదకు.[31]

# అనుబంధము

## ఇప్పటి మట్టునకు తెలిసిన అవధానములు చేసి - ఆశువులు చెప్పి- చాటువులు రచించిన కవులు

| | |
|---|---|
| అప్పల నరసింహ కవి, వక్కా | చా. మం. ద్వి. 170 |
| అమరేశ్వర శాస్త్రి, చతుర్వేదుల | చ. క. 168 |
| అష్టావధాని కవి | ద. వా. చ. 234 |
| అహోబల పండితుడు, గాలి | చా. మం. ప్ర. 173 |
| ఆంజనేయ శాస్త్రి, కుప్పా | చా. మం. ద్వి. 167 |
| ఈరపరాజు | చా. ర. 229 |
| ఓబన కవి, కొమ్మాలపాటి | చా. ర. 105 |
| ఓబళాచార్యులు | చా. మం. ద్వి. 134 |
| కవి చౌడప్ప | ద. వా. చ. 86 |
| కాశీపతి, పోకూరి | —— —— |
| కాళహస్తి కవి, రేవూరి | ద. వా. చ. 367 |
| కృష్ణకవి, మంచెళ్ళ | చా. ర. 202 |
| కృష్ణమాచార్య, కోరుట్ల | —— —— |
| కృష్ణమూర్తి, శిష్టు | చా. ర. 55,63. |
| కృష్ణమూర్తి శాస్త్రి, శ్రీపాద | —— —— |
| కృష్ణయామాత్యుడు, వెల్లపూడి | ద. వా. చ. 389 |
| కృష్ణశాస్త్రి, దేవులపల్లి | —— —— |
| కృష్ణాంబ | ద. వా. చ. 114 |
| కృష్ణాచార్యులు, కాశీ | —— —— |
| కొప్పరపు కవులు | కొ. సో. చ. |
| కోనమరాజు, వద్దిపర్తి | ఆంధ్రప్రభ, 30-6-1963 |
| కోలాహలుడు | చా. ర. 25 |
| క్షేత్రయ్య | ద. వా. చ. 86 |

| | |
|---|---|
| గిరిరాజ కవి | ద. వా. చ. 247 |
| గోపన, పలకలూరి | అ. క. 3-231 |
| గౌరరాజు | అ. క. 3-158 |
| చంద్రమౌళి శాస్త్రి, విరాల (అ) | — — |
| చంద్రశేఖర కవి | చా. మం. ద్వి. 166 |
| చిట్టప్ప, నాగళ్ళ | చా. మం. ద్వి. 116 |
| చిదంబర శాస్త్రి, పిశుపాటి | — — |
| తాతాచార్యులు, తిరుమల బుక్కపట్టణం | చా. ర. 91 |
| తిప్పన, దిట్టకవి | చా మం. ద్వి. 127 |
| తిప్పరాజు, రావిపాటి | అ. క. 3-60 |
| తిమ్మకవి | చా. ర. 17 |
| తిమ్మకవి, కూచిమంచి | చా. ర. 89 |
| తిమ్మకవి, పుష్పగిరి | చా. మం. ద్వి. 127 |
| తిరుపతి వేంకట కవులు | — — |
| త్రిపురాంతకుడు, కొప్పోలు | చా. మం. ద్వి. 116 |
| త్రిపురాంతకుడు, రావిపాటి | చా. మం. ప్ర. 75 |
| దత్తప్ప, మోచర్ల | చా. ర. 111 |
| దేవరాజ సుధీమణి, తంజనగరం | — — |
| దేవీప్రసాదు, మాచిరాజు | — — |
| ధూర్జటి కవి, కోట | చా. ర. 101 |
| నరస కవి, చెళ్ళపిళ్ళ | చా. ర. 69 |
| నరసకవి, పూరె | చా. ర. 90 |
| నరసింహ కవి, ఉప్పల | చా. ర. 129 |
| నరసింహ భారతీ స్వామి | చా. మం. ద్వి. 170 |
| నరసింహారావు, కాకాని | — — |
| నారాయణకవి, వేంకటరావుపేట | — — |
| నారాయణకవి, గండభట్టు | చా. ర. 147 |
| పట్టాభిరామరాజు, రాళ్ళభండి | చా. ర. 106 |
| పరతన్న, ఎడవల్లి | అ. క. 3-33 |
| పర్వతాలు | చా. మం. ద్వి. 131 |

| | |
|---|---|
| వెంకట సుబ్బకవి, కృష్ణిపాటి | చా. మం. ద్వి. 133 |
| వెంకట సుబ్బశాస్త్రి, రాళ్ళబండి | గిర. 196 |
| వెంకటస్వామి గుప్త, దోమా | చ. క. 167 |
| వెంకటాచలకవి, కుందుర్తి | — — |
| వెంకటాచార్యుడు, మాడభూషి | చా. మం. ద్వి. 137 |
| వేంకటావధాని, దివాకర్ల | — — |
| వెంకటేశ్వరరావు - నార్ల | — — |
| శంకరకవి, మోదుకూరి | చా. ర. 52 |
| శరభకవి, మాగావు | చా. ర. 62 |
| శివరామశాస్త్రి, వేలూరి | — — |
| శేషయకవి. | ద. వా. చా. 528 |
| శ్రీగిరి కవి, సోమరాజు | చా. ర. 98 |
| శ్రీనాథ కవిసార్వభౌముడు | చా. ర. 9 |
| శ్రీనివాస తాతాచార్యులు, శతక్రతు | ద. వా. చా. 161 |
| శ్రీరాయ రఘునాథ తొండమాన్ | ద. వా. చ. 419 |
| శ్రీ.శ్రీ. | — — |
| సంజీవరాయ కవి, నక్కలపాటి | చా. ర. 53 |
| సంపత్కుమారాచార్యులు, దూపాటి | — — |
| సత్యనారాయణ, విశ్వనాథ | — — |
| సర్వశాస్త్రి, శిష్టు. | చా. మం. ద్వి. 134 |
| సింగరాజు. | చా. ర. 150 |
| సింహాద్రినరసింహకవి, ఉప్పల | చా. ర. 128 |
| సీతారామప్రసాదరావు, కొప్పరపు | కొ. సో. చ. 137 |
| సీతారామయ్య | చా. ర. 186 |
| సీతారామచంద్రమూర్తి, నల్లపరాజు | చా. మం. ద్వి. 128 |
| సీతారామయ్య, నుదురుపాటి | ద. వా. చ. 410 |
| సుప్రసన్నాచార్యులు, కోవెల | — — |
| సుబ్బన్న శతావధాని | — — |
| సుబ్బరాజు - ఏనుగుధాటి | చా. ర. 198 |
| సుబ్బరామకవి, గోపాలుని | చ. క. 156 |

# సంకేత సూచిక

| | |
|---|---|
| అ. క. | అప్పకవీయము. |
| కొ. సో.చ. | కొప్పరపు సోదరకవుల చరిత్ర. |
| గీర | గీరతము. |
| చ.క. | చమత్కార కవిత్వము |
| చా.మం.ప్ర. | చాటు పద్యమణిమంజరి, ప్రథమ భాగము |
| చా మం.ద్వి. | చాటు పద్యమణిమంజరి, ద్వితీయభాగము |
| ద.వా.చ. | దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయ చరిత్ర |
| న.సా.వీ. | నవ్యాంధ్ర సాహిత్యవీధులు. |
| శ.సా. | శతావధాన సారము. |

